మనస్సైన జంటకు మనువు కుదిరితే ఉనికినే కాదు వూపిరి పీల్చటం కూడా మర్చిపోతారు.

SM

సురేష్ మూవీస్

# చక్రవాకం

ఈస్ట్‌మన్ కలర్







నిర్మాత: **డి.రామానాయుడు** దర్శకత్వం: **వి.మధుసూదనరావు**

ఆంధ్ర-సీడెడ్ **నవయుగ ఫిలింస్** నైజాం: **విజయా సురేష్ పిక్చర్స్**

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

ఒక క్రొత్త రకపు ఉతికే సబ్బును పొందడము ప్రారంభించండి—సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్!

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాదుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం 27–9–'74
ఆనందనామ సం నిజ భాద్రపదమాస శు ఏకాదశి
సంపుటము 68 సంచిక 2

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు 31–20 పై.
ఆరుమాసాల చందా – రు 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3

## విషయానుక్రమణిక



ముఖచిత్రం : కృష్ణకుమారి
(ఫోటో : ... మోహన్)

కథలు

ఆకలి .. 6
అబల 16
మళ్లీకథ మొదటికి .. 28
దొంగ 41

సీరియల్ కథలు

లాలస 12
పుత్తడి బొమ్మ 20

వ్యాసాలు, శీర్షికలు

ఉత్తరాలు—4, పరిణామం(గేయం)—7, ఎక్కట్లు (కవిత)—9, లోకంపోకడ—10, హైదరాబాద్ నోట్‌బుక్—15, వారఫలం—22, ధర్మపథం—23, సినిమా—24, వంటలు—29, ప్రశ్నావళి—30, చిన్నారి చిలిపిచేష్టలు—32, డాక్టర్ సలహాలు—36, ఫోలాక్సుని డైరీ—38, ఇంటింటి చిట్కాలు—45, అవీ—ఇవీ—అన్నీ—46

# ఉత్తరాలు

### సీరియల్

ఉప్పల రాజామణిగారి "మాతృమూర్తి" సీరియల్ చాలా బాగుంది చదువ ఆసక్తిగా ఉంది వారెంతయినా అభినందనీయులు

బికుముళ్ల కృష్ణమూర్తి (హైదరాబాద్)

* * *

"అతకని అనుబంధాలు" రచయిత శ్రీ పి ఎన్ శాస్త్రిగారు, నాగార్జునసాగర్ కొండ మ్యూజియమ్ లోని శిల్పసంపదను ఆనాటి బవుద్ధుల జీవితాన్ని గూర్చి చాలా చక్కగా వ్రాశారు వారి రచన చదువుతూంటే మనసు 'నాగార్జునసాగర్' వెళ్లిపోయింది లోగడ అక్కడ పనిచేసిన నాకు, ఆ సుందర దృశ్యాలు మన ఫలకముపై ఒకమారు కన్పించాయి

నిజంగా నాగార్జునసాగర్ ప్రాజెక్టులో పని చేయడమే గొప్ప వరము అలనాటి బవుద్ధ ఆచార్యుల పాదస్పర్శతో, ఆ తర్వాత సుమారు వేయి సంవత్సరాల తరువాత అలనాటి పలనాడు వీరుల పాదరేణువులతో పునీతమైన భూమి అది

నిజంగా శ్రీ శాస్త్రిగారు వ్రాసినట్లు మనకి, మన చరిత్ర సాంస్కృతులపై 'బాధ్యతతో' కూడిన 'గౌరవము' ఎప్పటికి కలుగుతుందో?

"కళ్యాణమణి" (నాగిరెడ్డిగూడెం)

### కథలు

నారాయణరావుగారి (విశ్వాసం) కథ చాలా బావుంది ఈ కథ ఈనాటి ఆఫీసర్లకు కనువిప్పు.

—స. విశ్వశ్రీ (రాజమండ్రి)

* * *

తుమ్మెతాంగి గారి కథ "అన గనగా వో సుబ్బారావు కథ" చాలా బాగుంది ఉన్నత విద్యావంతుడు కాక పోయినా, నవీన దృక్పథభావాలు గల సుబ్బారావు లాంటి యువకులు ఈ కాలంలో కనపడుట అరుదు ఈనాడు పెద్ద పెద్ద చదువులు చదివినవారే, ఆస్తి, అందమున్న అమ్మాయిల కొరకు ప్రాకులాడుతారు

తంగిరాల సత్యనారాయణరెడ్డి, సక్కుబాయి (పాలెము)

### ముఖచిత్రం

16 8 74 పత్రిక హిందీనటి ప్రేమానారాయణ ముఖచిత్రంతో వెలువడి మా హృదయాలను ఆకట్టుకొంది ముఖచిత్రం తెలుగు నటీనటులదే వేస్తే బాగుంటుందని మా అభిప్రాయం

ఇ శివరాములు, మంజులత (షాద్‌నగర్)

### సినిమా

అర్యా, మన కేంద్రప్రభుత్వం 1973వ సంవత్సరపు ఉత్తమ చిత్రాలకు జాతీయ అవార్డులు ప్రకటించింది ఉత్తమ చిత్రాల జాబితాలో మన తెలుగు చిత్రం ఒక్కటీ లేకపోవటం చాలా విచారించదగ్గ విషయం, తెలుగువాడు నిజంగా సిగ్గుపడవలసిన విషయం ప్రతి సంవత్సరం వచ్చే ప్రాంతీయ బహుమతి కూడా ఈ సంవత్సరం రాలేదు మన తెలుగు చిత్రాల స్థాయి ఎంతలో ఉందో దీనిని బట్టి వూహించవచ్చు ఒక చిత్రం ప్రజలలో నూతన చైతన్యం తీసుకురాగలిగేలా ఉండాలిగాని ప్రజలలో చెడును రేకెత్తించేదిగా ఉండకూడదు ఇకనైనా మన నిర్మాతలు చక్కని చిత్రాలని తెలుగు ప్రజలకు అందిస్తారని మన ముక్కోటి ఆంధ్రులం ఆశిద్దాం సెలవు

బులుసు కామేశ్వరరావు (గుంటూరు—2)

### ఇండో – సోవియట్ వాణిజ్యం

సోవియెట్ యూనియన్ ఆర్థిక సహాయం ఇండో—సోవియెట్ మైత్రికి ముఖ్యలక్షణం అయింది అని శ్రీ హిరేన్‌ముఖర్జీ (ఎం పి ) గారు 30 8 74 సంచికలో వ్రాశారు

సోవియెట్ మన దేశానికి అంతరాతీయ సమితిలో 'వీటో' తెలిపి సహాయపడింది కాని వాణిజ్య రూపేణ మనకు నష్టము కలుగచేస్తున్నది

ప్రపంచ మార్కెట్ ధరకు 10 నుండి, 20 శాతం తక్కువగా మనదేశం నుండి ఉక్కును కొంటుంది అమెరికా వారు 60 పైసలుకు కిలో చక్కెర కొంటుంటే 42 పైసలుకి కిలోకు కొంటుంది ఈ సోషలిస్టు మిత్ర రాజ్యం

ప్రపంచ మార్కెట్‌లో నున్న ధర కన్న రెట్టింపు ధరకు నికెల్ మనకు అమ్ముతున్నది ఉదహరిస్తే చాలా ఉన్నవి ఇలాటివి

విద్యుత్ కర్మాగారాలు, భారీ యంత్ర పరిశ్రమలు, యంత్ర విడిభాగాలు మొదలగునవి మనం వారి వద్దనుంచే వారు చెప్పిన ధరకు దిగుమతి చేసుకుంటున్నాము ఉక్కు, ప్రత్తి, టీ, పొగాకు, డబ్బాలలో నిల్వ చేసే రసా— ఆహారాలు మొ ముడి మరియు ఆహారపదార్థాలు మనం వారు చెప్పిన ధరకే అమ్ముచున్నాము మన సరుకులలో కొంచెం నాణ్యత తగ్గినను వారు కొనుటకు తిరస్కరించుచున్నారు వారమ్మే సరుకులు ఎలావున్నా మనవారు మాట్లాడటంలేదు

ఇక్కడి కల్తీ వ్యాపారస్తుడి వల్ల సామాన్యుడు ఎంత నష్టపోవుచున్నాడో, సోవియెట్ యూనియన్‌తో వాణిజ్య సంబంధాలు నెలకొల్పుకుని భారత దేశం అంత నష్టపోవుచున్నది

ఈ సత్యాన్ని భారత సోషలిస్టు ప్రజా నాయకులు కాదనలేరేమో

మల్లెల విజయకుమార్ (మద్రాస్) ●

సాయంకాలం ఐదయింది—ఆకాశంలో పడమట నుండి నల్లని మేఘాలు కమ్ముకొస్తున్నాయి మే నెల ఆఖరి వారం.

మిడిల్ స్కూలుకు ఎదురుగా రోడ్డు ప్రక్కన గల చిన్న పేట అది పేటలోని జనం ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులు, రిక్షావాళ్లు, కూలీలు పేటకు కొంచెం దూరంలో సిబ్బిగాడి సారాయి దుకాణం వున్నది దుకాణం పంచన కూచుని కర్రల బొగ్గుల్తో రాజేసిన కుంపట్లో కబాబులు కాలుస్తున్నాడొక పన్నెండేళ్ల కుర్రాడు కాల్తున్న మాంసం ముక్కలు ఘాటు వాసన కొడుతున్నాయి దుకాణంలోని ట్రాన్సిస్టర్ ''మైనే పీనా సీ ఖ్ లియా'' పాట పాడుతోంది సిబ్బిగాడు గల్లాపెట్టె ముందర

# ఆకలి

## బెలమర జోగారావు



కూచుని ఫిల్టర్ విల్స్ సిగరెట్ కాలుస్తున్నాడు దుకాణంలో ఎక్కువ రద్దీ లేదు ఎంగిలి గ్లాసులు కడిగే కుర్రాడు తన పనిలో నిమగ్నమై వున్నాడు

[illegible]ట్టుకొయ్యకు రోడ్ ప్రక్కన కట్టిన తన గేదెను విప్పి ఇంటి సాలలో కట్టెయ్యడానికి వచ్చాడొక ఆసామి భూమిలో నిలువుగా పాతిన అడుగు పొడవున్న లావుపాటి ఇనుప ముక్కకు కట్టిన త్రాడు విప్పాడు ఇనుప ముక్క నిటారుగా, మొనసూదిగా భయం గొలిపేట్టు వున్నది "పిల్లలెవరయినా ఆడుకుంటూ ప్రమాదవశాత్తు దీని మీద పడితే అపాయమేగదా దీన్ని రేపు వంగదియ్యాలి'' అనుకుంటూ ఆసామి గేదెను ఇంటి వైపు పేట సందులోకి తోలుకుపోయాడు

సన్నని తుంపరల్తో వాన ఆరంభమైంది దుకాణానికి కొంచెం దూరంలో నున్న వేప చెట్టు క్రింద పిచ్చి ముత్తయ్య నిలబడి వున్నాడు వాడి శరీర మంతా మట్టి గొట్టుకుపోయి వున్నది తైల సంస్కారం ఎరుగని జుత్తు నడ్డి మీద నుండి మోకాలి చిప్పల వరకూ పేలికలై మాసిపోయిన నిక్కరు వేలాడుతోంది. ఒంటిమీద మరో ఆచ్ఛాదన లేదు చేతిలో సొట్టలుపడ్డ చిన్న అల్యూమినియం గిన్నె వున్నది.

ముత్తయ్య ఒకప్పుడు ఫ్యాక్టరీలో మేస్త్రీగా పని చేసేవాడు పేటలోని వాళ్లంతా అతణ్ని అభిమానించేవాళ్లు. అతడి పెళ్లాం కూడా భర్త అడుగు జాడల్లోనే నడిచేది అంతలోనే అతడి అదృష్టం వక్రించింది అదేదో మాయదారి సమ్మె వచ్చి పడింది సమ్మెలో పాల్గొన్నందుకు జైలు కెళ్లాడు పోలీసులచేత దారుణంగా దెబ్బలు తిన్నాడు. ఉద్యోగం పోయింది జైలు నుండి వచ్చేక ఫ్యాక్టరీ తెరువబడింది. కాని మళ్లీ ఉద్యోగం దొరకలేదు సంపాదించిన కాస్త డబ్బూ పెళ్లాం ఒంటి మీదున్న నగలు, ఇంట్లోని విలువయిన సామాన్లు కరిగిపోయాయి ఉద్యోగం కోసం తిరగడంలో విసిగి వేసారిపోయాడు నెమ్మదిగా త్రాగుడు అలవాటయింది పోలీసులు కొట్టిన బలమైన దెబ్బలు తగిలి తల మీద గాయాలు అయినాయి ఆ గాయాలు మానిపోయినై కాని, కాస్త మెదడు పాడయింది సారాయి నిషాలో ఒంటిమీది బట్టలు చింపుకుని ''ఇంక్విలాబ్ జిందాబాద్''అంటూ అరచుకుంటూ తరచుగా రోడ్లమీద తిరిగే వాడు దాన్తో అతడికి పిచ్చి పట్టిందని జనం అనుకోసాగారు

త్రాగుబోతు కార్మికులెవరయినా ముత్తయ్యకు కాస్త సారాయి పోస్తారు అది పుచ్చుకున్నాక వాడి పిచ్చి విజృంభిస్తుంది పేటలోని కొంటె కుర్రాళ్లు చుట్టూ చేరి కవ్విస్తారు '' ఇంక్విలాబ్ జిందాబాద్ '' అంటూ కుర్రమూకలో అరుపు వినబడ్తుంది ఆ మాట వినపడగానే — ఏదుబంది ముళ్లను నిగిడ్చినట్టు—ఒళ్లు విదిలించి గార్దభస్వరంలో ఆ వాక్యాన్ని ఉచ్చరిస్తాడు ఇహ తిరువీధి మహోత్సవం మొదలవుతుంది ముందు నడుస్తూ వాడు, వెనుక పిల్లమూక అరచుకుంటూ పేట సందుల్లో, రోడ్‌మీద తిరుగుతారు. ఇది ముత్తయ్య తరచూ ప్రదర్శించే వినోద కార్యక్రమం

వేపచెట్టు క్రింద నిలుచున్న ముత్తయ్య నగ్నదేహం వర్షానికి తడిసి గజగజా వణుకుతోంది. వాడి దృష్టి దుకాణం పంచలో బొగ్గుల కుంపటి మీద కాల్తున్న మాంసపు ముక్కలమీదున్నది. వాలికతో పెదిమలు తడుపుకుంటూ వాట్నే కక్కుర్తిగా చూస్తున్నాడు.

ఇంతలో ఇరవై రెండేళ్లకు మించని వయస్సుగల ఎనిమిదిమంది కుర్రాళ్ల గుంపు సారాయి దుకాణంలో దొరబడింది వాళ్లంతా చిల్లరమల్లర దొంగతనాలు చేసే రౌడీ మూక చేతిలో బాగా డబ్బుంటే మస్తుగా తిని త్రాగి తందనాలాడ్తారు. జూదం, వ్యభిచారం వాళ్ల ముఖ్యమైన అలవాట్లు పేటలోని ప్రజలు

బజారులోని ఫోటో వ్యాపారస్తులు వీళ్లదౌర్జన్యానికి భయపడి తప్పుకుంటూ వుంటారు

"ఏం గురూ! మనపని జోరుగా వుందే, ఎక్కడయినా హెవీ మాల్‌గోల్‌చేశారా ?..." సిబ్బిగాడు రౌడీల నాయకుణ్ని అడిగాడు

" చాలా రోజుల్నుండి వేసిన ప్లాన్ ఇవాళ ఏక్షన్ అయిందిలే ఈ పార్టీ అడ్వాన్స్ అనుకో! నెంబర్ వన్ సరుకుందా ? మొవ్వాయేనా ? (విప్పసారా ?) ఒరేయ్ కన్నయ్యా గ్లాసులన్నీ శుభ్రంగా కడగరా! . పిట్టూ, నీ దగ్గరున్న కబాబులన్నీ కాల్చెయ్యి. సిబ్బీ! మంచిసరుకు ఇవ్వాలి నీళ్లు కలిపిం దిచ్చావో నీ కీళ్లులూజ్ చేస్తాను తెల్సిందా! రౌ నా అన్నాడు

" గురూ! మంచి సరుకు నీలాంటి వాళ్లకు గాకపోతే ఇంకెవరికిస్తాను ? కంపెనీ మాల్ నాలుగు సీసాలే! మొవ్వా బోలె డుంది! వర్కర్లకు జీతాలింకా దొరకలేదు. మన బిజినెస్ డల్‌గా నడుస్తోంది మరి . మహజనీ (యజమాని)మాల్‌సప్లయి తగ్గించే శాడు గురూ! "మాట్లాడుతూనే కసాబులు నాలుగు బైటికి తీశాడు

"ఎవడ్రా మహజన్ ! సరుకు ఇవ్వనంటు న్నాడా ? మాకు లైట్ పార్టీ ఇయ్యి ఆ తరువాత చూడు మా తడాఖా మహజన్‌కు కిర్రెక్కుతుంది కన్నయ్యా గ్లాను లిటెయ్యి" అన్నాడు రౌ నా

"మీ సంగతి తెలీదేంటి గురూ! మహజన్ మనవాడేలే . కలరా .. సోడాలా గురూ . " అంటూ కసాబుల మూతలు వూడదీసి గ్లాసుల్లో నింపాడు.

" ప్లెయిన్ కొడ్తాములే! పిట్టూ కబాబులింకా కాల్చలేదా ?... కన్నయ్యా కొంచెం బైటనిలబడి టోలా లొస్తారేమో చూడు! క్రొత్త ఇన్‌స్పెక్టర్ వచ్చాడట ఠాణాకు "

"వర్షం పడ్తోంది తడుస్తాను " పదేళ్ల కన్నయ్య నసిగాడు

"...నా మాటకెదురు చెప్తావురా! వెళ్తావా! తన్నాలా!..."అంటూ హుంకరించాడు రౌ నా. కుక్కిన పేనులా కన్నయ్య బైటకు నడిచాడు.

యుద్ధం మొదలయింది. గ్లాసు లెత్తి గడగడా త్రాగారు. బాగా కారం పట్టించి కాల్చిన మాంసం ముక్కలు వేడిగా రుచిగా వున్నాయి మొదటి రౌండ్‌లోనే అందరి నషాళాలకు




చుర్రుమనివేడి అంటింది. మాంసపుముక్కలు నములుతున్నారు మళ్లీ గ్లాసులు నిండాయి. సిబ్బిగాడి గవర్నమెంట్ సరుకు ఖతమ్ అయి పోయింది మొవ్వా తీశాడు

## పరిణామం

—జి యల్. కాంత్

చీకట్లో కీచురాయి
వాకిట్లో రోదిస్తోంది.
మదలో బాధ
హృదయాన్ని పీడిస్తోంది.
అంతులేని కోర్కెలు
సందులేని త్రోవలు
కోరిక చిన్నది
ఆశ పెద్దది
అర్థంలేని ఆవేశాలు
వ్యర్థమైన వైషమ్యాలు
ఈరోజు తృప్తి
రేపటి అసంతృప్తి
రేగే కోర్కెలకు
ఆగే కాలంకాదు
ఒంటరి మనసు
తుంటరిగ మనలు
కలిసింది తోడు
గడిచింది కాలం
ఒకరి కిద్దరు
ఇద్దరికి ముగ్గురు.
కుటుంబం పెరుగుచుండింది
గంజి ఆవిరైపోయింది

". ఆ చెట్టు క్రింద వర్షంలో ఎవడ్రా నిలబడి వున్నాడు "అడిగాడు రౌ నా

వేపచెట్టు క్రిందనిలబడి దుకాణం వేపు చూస్తున్న ముత్తయ్యను చూసి సిబ్బిగాడు "ఓస్! వాడా! పిచ్చి ముత్తయ్యగాడు .." అన్నాడు.

రౌ నా చప్పట్లు చరిచి కేకవేసి ముత్తయ్యను రమ్మని పిలిచాడు వాడు వీళ్ల కేకలువిని మొహం ఇంకోవేపు త్రిప్పుకున్నాడు వాడి నిర్లక్ష్యానికి రౌ నా. కోపం తెచ్చుకున్నాడు

" రాఖా వెళ్లి వాణ్ణి లాక్కురా రాకపోతే తన్ని ఒయాడ్చుకురా! " రౌ నా ఆజ్ఞాపించాడు రాఖా గ్లాసు ఖాళీ చేసి లేచి నిలబడి నడుముకు కట్టిన తోలు బెల్టువిప్పి ముందు కడుగువేశాడు

". పోనియ్యిగురూ! పిచ్చాడితో మన కేమిటి? " సర్దిచెప్పాడు సిబ్బిగాడు

". వాణ్ణి కొట్టాలని సరదా పడ్డంలేదు ఏమయినా తినడానికిద్దామని పిలుస్తున్నాను వాడి గర్వం చూడు ..." అన్నాడు రౌ నా

"నేను తినిపించాలా గురూ! ..." రాఖా రొమ్ము విరుచుకుని అడిగాడు

"వద్దు వాణ్ణి లాక్కురా! ." అన్నాడు రౌ నా

రాఖాను చూస్తూనే మీద పడబోయే విపత్తును గుర్తించి ముత్తయ్య బె

పోయాడు తప్పించుకు పారిపోవడానికి ప్రయత్నించి విఫలుడై రాఖా చేతులో చిక్కిపోయి గజగజ లాడ సాగాడు రాఖా వాడ్ని బరబరా ఈడ్చుకువచ్చి దుకాణంలో కుదేశాడు.

" ఏంరా పిలిస్తే వినబడలేదా! ఒళ్లు కొవ్వు పట్టిందా?" అన్నాడు రౌ నా కళ్లు పెద్దవిచేసి ముత్తయ్య భయంగా చూశాడు

"మీరంతా దొంగలు, మంచివారుకాదు నాకు భయం" అన్నాడు వాడు

" నేను మంచి వాడిని కాదురా? సరేలే ఇంత సారాయి త్రాగుతావా?" గ్లాసు అందిస్తూ అడిగాడు రౌ నా ముత్తయ్య ఆత్రంగా గ్లాసందుకోబోయాడు రౌ నా గ్లాసు చటుక్కున వెనక్కి లాక్కుని కాలు సాచి ఒక్క తన్ను తన్నాడు ఆ తాపుతో వాడు క్రిందపడి లేచి పారిపోబోయాడు

"... కూచో పరుగెత్తక .. దొంగ తొత్తు కొడకా! నేను మంచివాడిని కాను, సారాయి మంచిది కదూ! ." హుంకరించాడు రౌ నా

ముత్తయ్య గజగజ వణుకుతూ ముడుచుకుని కూచున్నాడు

".. పిట్టూ, కబాబ్ ముక్కొకటి వాడికియ్యి" అన్నాడు రౌ నా.

పిట్టూ నవ్వుతూ కాల్చిన మాంసపు ముక్క ఒకటి అందివ్వబోయాడు ఈసారి వాడు తొందరపడలేదు రౌ నా మొహం వేపు, మాంసపు ముక్క వైపు భయం భయంగా చూసి దీనంగా మొహం పెట్టాడు

రౌ నా. పకపకా నవ్వాడు. అనుచరులంతా విరగబడి నవ్వారు—ఎలుకకు ప్రాణ సంకటం పిల్లికి చెలగాటంలా వున్నది వాడి స్థితి

" దెబ్బకు దెయ్యం జడుస్తుంది! .. తిను! ఏంఫర్వాలేదులే ." రౌ నా అభయ హస్తం ఇచ్చాడు అయినా వాడిలో భయం తొలగిపోలేదు. పిట్టూ ఆ ముక్కను వాడి నత్తుగిన్నెలో గిరవాటేశాడు

" ఇంక్విలాబ్ జిందాబాద్! . ముత్తయ్య పెళ్లాం అనకాపల్లి బెల్లం .." రౌ. నా అనుచరులంతా సరదాగా అరుస్తూ కవ్వించ సాగారు కాని ముత్తయ్య ఆ మాటలు చలనం కలిగించలేదు నిర్వికా

రంగా వాళ్ళవేపు చూసి నెమ్మదిగా బొచ్చె లోని ముక్క అందుకుని నమలసాగాడు

ఏమిటి గురూ! ముత్తయ్య చాలా ఢీలాగా వున్నాడు కొంచెం హుషారుగా వుండేట్టు చెయ్యాలి" అన్నాడొకడు రౌనా త్రాగగా గ్లాసులో మిగిలిన సారాయి కొంచెం వాడి బొచ్చెలో పోశాడు — తెనాలి రామలింగడు పెంచిన పిల్లి పాలగిన్నెను చూసిన చందాన దాన్ని చూశాడు వాడు

' త్రాగరా! భయం లేదులే! ఇప్పుడు నువ్వు మా గెస్టువి, తినడాని కేదయినా కావాలా! ఎట్సా! కబాబ్స్ ఖలాస్ అయిపోయినాయా? ఒరే కన్నయ్యా ఇలారా!' బైట కాపలా కాస్తున్న కన్నయ్యగాడ్ని రౌనా పిలిచాడు కాపలా డ్యూటీ తప్పినందుకు ఆనందంగా వచ్చి రౌనా ఎదుట హాజరైనాడు వాడు రౌనా జేబునుండి నోటు తీశాడు రెండు పది నోట్లు ఎబ్బిగాడికిచ్చాడు ఐదు రూపాయల నోటొకటి కన్నయ్యకిస్తూ చెప్పాడు

' నాలుగు చపాతీలు, ఆలుదుంపల కూరా, పొట్లం కట్టించుకుని తొందర గారా! కన్నయ్య అక్కడ్నించి రాకెట్‌లా దూసుకుపోయాడు వర్షం సన్నని తుంపర్లుగా పడుతూనే వున్నది మళ్ళీ గ్లాసులు నిండాయి ఈసారి ముత్తయ్య బొచ్చె కూడా నిండింది వాడి కళ్ళలో భీతి మాయమై ఎచ్చి సంతోషం తొణికిసలాడింది ఆత్రంగా గిన్నెలోని సారాయి త్రాగేశాడు వెచ్చని ఘాటయిన సారాయి గొంతు దాటి పొట్టలో పడగానే నరాలు జివ్వు మన్నాయి వెర్రి ఆనందంతో మనస్సు ఉరకలు వేసింది

"ఇంక్విలాబ్ జిందాబాద్" అన్నాడు హుశారుగా ముత్తయ్య,

రౌనా వాడి అనుచరులు, సిబ్బిగాడు అంతా ఒక్కసారి ఉలిక్కిపడి వాడికేసి చూసి పగలబడి నవ్వారు "అబ్బో! బండికి జోరెక్కింది" అన్నాడొకడు

"ముత్తయ్యా జిందాబాద్!" అన్నాడు రౌనా

అప్పటివరకూ ముణ్ణుదిన్న పాములాగున్న ముత్తయ్యలో హుషారొచ్చింది ట్రాన్సిస్టర్‌లో 'ఝుమ్కా గిరారే, బరేలీ బాజార్‌మే, ఝుమ్కా' పాట రంజుగా వస్తోంది

"ముత్తయ్య డాన్సు చెయ్యాలి! డాన్సు' రౌనా అనుచరులంతా కేకలు పెట్టి అరిచారు అతడి బొచ్చెలో తలాకాస్త సారాయి పోశారు అది త్రాగేసి ముత్తయ్య వాళ్ళ కోర్కెను మన్నించాడు పొట్టగిన్నె నెత్తిమీద బోర్లించుకుని బక్క చిక్కిన దేహాన్ని మెలికలు త్రిప్పుతూ, చేతుల్ని విచిత్రంగా కదిలిస్తూ పాటకు అనుగుణంగా ఎచ్చినాట్యం చెయ్యసాగాడు అనుచరులంతా ఉన్మాదపూరితమైన ఆనందంలో పరిహాసాలు చేస్తున్నారు ఆ క్షణంలో మనిషిలోని ఆత్మాభిమానాన్ని ఆత్మ విశ్వాసాన్ని గౌరవాన్ని మనిషికిగల సహజ బలహీనతలు హేళనచేసే మట్టిలో కలిపేసినై పాట ఐపోయింది

కన్నయ్య హోటల్నుండి తిరిగొచ్చాడు చపాతల పొట్లం చిల్లరా రౌనా కిచ్చాడు పొట్లం విప్పి టేబుల్ మీద పెట్టారు నూనెలో కాల్చిన చపాతీలు బంగాళదుంప కూరా నోరూరేటు చేస్తోంది నృత్య కార్యక్రమం ఆగిపోయింది ముత్తయ్య వాటికేసి ఆశగా చూడసాగాడు రౌనాకు ముత్తయ్య నాట్యం ఆపెయ్యడం ఇష్టంలేదు కాని ట్రాన్సిస్టర్‌లో పాటలు ఆగిపోయినై వాడి చేత ఇంకేవయినా వెర్రిపనులు చెయ్యించి ఆనందం పొందాలని ఉన్నది

ముత్తయ్యా! అదుగో ఆ గోడ స్కూల్ గోడ కన్పిస్తోందికదూ బట్టలు విప్పేసి పరుగెత్తుకెళ్ళి దాన్ని ముట్టుకుని తిరిగి రావాలి అప్పుడిక ఈ చపాతీలన్నీ నీవే రౌనా అన్నాడు

'ఇలాగే పరుగెత్తి ముట్టుకుని తిరిగొస్తాను' అన్నాడు ముత్తయ్య వాడి బుర్ర పనిచేస్తూనే వున్నది ఆ క్షణంలో

అబ్బా! చమత్కారి జెల్లవే అదేం కుదర్దు చపాతీలు వద్దా? అంటూ రెట్టించాడు రౌనా వాడు ఎగ్గు పడకపోయే వాడే గొడుగులు వేసుకుని రోడ్‌మీద వస్తూ పోతూన్న జనాన్నిచూసి సంకోచించాడు అదీ గాక పేట ఎక్కనుంచే పరుగెత్తుకుపోయి రోడ్‌దాటి గోడదగ్గరకెళ్ళాలి పేటలోనుండి జనం వచ్చి పోతున్నారుకూడా

'ముత్తయ్యా! ఆలస్యం ఎందుకూ? ఇరవై గజాల దూరానవున్న గోడను ముట్టుకుని తిరిగి రావడమేగా! ఊఁ రెడీ! త్వరగా! మేటి భారతవీరుడివి నువ్వే

## వెక్కిళ్లు

— కళాప్రపూర్ణ, తెనుఁగు లెంక — తుమ్మల సీతారామమూర్తి

జీవిత మొక మంజుల కళ
కావలయును మధురశిల్పఖని కావలయున్
నావాఁడు లాఁతివాఁ డను
భ వన చన్నపుడె యిట్టి బ్రదుకు లభించున్

చెట్టు పుట్టి పెరిఁగి చిన్నారి పొన్నారి
పూలు పూచి కాచి మేలిరుచుల
పండ్ల నిచ్చి యెండి పడఁగుఁ బ్రహ్మయ్యో
నెంతయూవి వేర్పు నిది బలారె!

ఏసుకథలెల్ల మసకేల దోఁగాని
తన్ను దయమాలి చిత్రవధం బొనర్చు
నజ్ఞులను సైఁపు మోతండ్రి! యన్నసుద్ది
చాలుఁ జాలు సహస్ర యుగాల వఱకు

అంతభాగ్యమున్న నమెరికా ప్రజ కన్ను
మూఁతపడదు మత్తుమాత్రలేక
యీ యశాంతి కేది హేతువు? అజ్ఞా
కష్టములఁ దలంచు దృష్టి లేమి

## —లోకంపోకడ——ఈమెన్—




## ఆకలి

ముత్తయ్యా జిందాబాద్! '' అంటూ రా నా రెచ్చగొట్టాడు

ముత్తయ్యకు ఆవేశం హెచ్చింది త్రాగిన సారాయి ఉన్మాదాన్ని ప్రోత్సాహపర్చింది ఆకలి వాడ్ని నికృష్ట చర్యకు పురిగొల్పింది బొచ్చె నేలమీద పడేశాడు పంట్లాం విప్పిపారేసి బైటకు వచ్చాడు దర్శకులంతా హర్షధ్వానాలు చేశారు రా నా చపాతీలు కూరా బొచ్చెలో పడేశాడు ఈ గోల, చోద్యం చూసి రోడ్‌మీది జనం నిలబడ్డారు తల్లి కడుపులోనుండి అప్పుడే బైటపడ్డ శిశువులా ముత్తయ్య నిలబడి చుట్టూ చూశాడు ఒకరిద్దరు ఆడవాళ్లు పేట సందులో నుండి పైకి రాబోయి ముత్తయ్య దిగంబర అవతారాన్ని గాంచి వెనక్కితగ్గి మాయమైపోయారు తిరిగి

'ఒన్ టూ త్రీ '' అన్నాడు రా నా

హుంమ్మంటూ నోటితో చప్పుడు చేసి ముందుకు ఉరికాడు ముత్తయ్య మరుక్షణాన కొంత దూరంలో బురదలో కాలుజారి ధబేలున పడ్డాడు అమ్మా! ' అంటూ వాడు చేసిన ఆర్తనాదం క్షణంసేపు ప్రతిధ్వనించి గాలిలో కలిసిపోయింది

చూసిన వాళ్లంతా చిత్తరువుల్లా మ్రాన్పడి పోయారు క్రింద పడినవాడు మళ్లీ లేవలేదు జనమంతా వాడిచుట్టూ గుమిగూడి భయంగా చూశారు పశువుల్ని కట్టుకొయ్యగా వుపయోగించే, ఆ ఇనుప ముక్క సూదిమొన వాడి ఛాతీని నిర్దాక్షిణ్యంగా చీల్చేసింది ప్రమాదవశాత్తూ కాలుజారి దానిమీదే పడ్డాడు వాడు ఆ భీకర దృశ్యం చూసిన వాళ్లంతా నిశ్చేష్టులై నిలబడిపోయారు కాలువగట్టిన వర్షపునీళ్లలో ఛాతీ నుండి కారుతున్న నెత్తురు కల్సి ఆ ప్రదేశమంతా ఎర్రగా ఐపోతోంది

నాలుగు చపాతీలకోసం నగ్నంగా పరుగెత్తి దారుణంగా ప్రాణాల్ని పోగొట్టుకున్న వీరుడు ముత్తయ్య బొచ్చెలోని చపాతీల్ని ఎవరూ లేకపోవడం గమనించి ఎత్తుకుని పారిపోయిందొక కుక్క

ఏ ట్రేడ్‌మార్క్‌లోనైనా

# నమ్మకము

కలగడానికి కారణమేమిటి?

ఉదాహరణకి బట్టలనే తీసుకోండి ఓ పేరు ప్రముఖంగా
కనిపిస్తుంది అదే 'టెరీన్'○ దీని ప్రసిద్ధి అధికం
కావడానికి కేవలం అందాలుచిందే ప్రింట్లే కాదు
కారణం దాని ఉత్కృష్టమైన నాణ్యత కూడా
కారణమే నయనాకర్షితాలు దీని డిజైన్లు
అయితే ఇదే ఇంకా, ఇంకా కావాలని ప్రతివారినీ
కోరేటట్లు చేసేది దీని అపూర్వమైన నాణ్యతే,

TERENE

○ టెరీన్ — కెమికల్స్ అండ్ ఫైబర్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్

CHAITRA CAFI 250-TEL




*(గత సంచిక తరువాయి)*

హాలంతా శుభ్రంగా తడిబట్టపెట్టి తుడిచి, గోడవారగా తివాసీ పరిచారు గుమ్మానికి "హాపీహోమ్ 'అని రాసి ఫేబ్రిక్ పెయింటు చేసిన ర్టైన్ వేశారు అల్మారాలో పుస్తకాలు అన్ని నీటుగ సర్దింది సుందరి

'వుండవే వుండు అంటూ రమణ తన గదిలోకివెళ్ళి తను వేసిన గ్లాస్ పెయింటింగ్ ' తెచ్చి హాల్లో పెళ్ళి కొడుక్కి వేసిన కుర్చీకి ఎదురుగా గోడకి తగిలించాడు తమ్ముడి తాపత్రయం చూసి ఎన్నగ మునిపంటితో పెదవి కొరుక్కుంటూ నవ్వింది అనూరాధ

'ఎందుకే అక్కా నవ్వుతావు! ఆయనగారు పెద్ద డాక్టరు నన్ను మెచ్చుకుంటే ఎంత గొప్ప అన్నాడు

ఈ లోగా లక్ష్మి ఖాళీ విమ్ ' డబ్బాతో తను తయారు చేసిన ఫ్లవర్ వాజ్ తెచ్చి టేబిల్ మీద పెట్టి అందులో నాలుగు ప్లాస్టిక్ గుత్తులు వేసింది దాని ప్రక్కన రేడియో అటు పక్కగ టేబిల్ లైటు అమరి వున్నాయి కార్నర్‌లో వున్న మీడియం సైజు గాడ్రెజి బీరువాపై చిన్న తెల్లటి గుడ్డపరచి దానిపైన అగరబత్తులు గుచ్చుతూ వాళ్ళు గుమ్మంలో వుండగానే ఇవి వెలిగించాలి ఇక్కడ ఎవరు వుంటే వాళ్ళు ఆపని చెయ్యాలి తెలిసిందా! వింటున్నావురా అన్నయ్యా' అంది సుందరి హెచ్చరికగ !

అప్పటికే అంతా మంచిబట్టలు కట్టుకుని ముస్తాబయ్యారు

'ఒసే సుందరీ! నువ్వు దొడ్లో వున్న ఆ కాసిని కనకాంబరాలు కోసి దండకట్టి అక్కయ్యకు ఇవ్వరాదుటే నేను శోభకి జడ వెయ్యాలి అంది లక్ష్మి

'ఆఁ ఇంకా ఇప్పుడేం వద్దులేవే'' అంది అనూరాధ

పోన్లే వున్నాయిగా కోస్తానుండు నీ డ్రస్సుకి చక్కగ మేచ్ అవుతాయి అంటూ సుందరి ఇంటి వెనక్కి ఎరుగెత్తింది లేడిలా!

అనూరాధ ఆరంజి కలరులో నల్లటి బోర్డరులో వున్న పట్టు ఎరికిణీ గులాబిరంగు ఫుల్‌వాయిల్ ఓణి అదేరంగు జాకెట్టు వేసుకుంది చెవులకి కాస్త పెద్ద సైజు రింగులు మెళ్ళో లాకెట్ చైను వేసుకుంది అనూరాధ జుట్టు రింగులు రింగులు తిరిగి తుమ్మెద రెక్కలావుండి జడ కురచగ వుంటుంది అందుకని రెండు జడలు వేసుకుంటుంది రోజూ కాని ఈ రోజు తల్లి ఆజ్ఞ ప్రకారం ఒక్క జడగొంచెం లూజుగ అల్లుకుంది నల్లగా కాటుక పెట్టిన కళ్ళు అనూరాధ చక్కని చుక్కలావుంది చేతినిండా ఎర్రరంగు మట్టిగాజులు వేసుకుంది ఇంతలో సుందరి ముద్దుగా బొత్తుగా కట్టిన కనకాంబరం పూలదండ తెచ్చి జడలో పెట్టింది

*జరిగిన కథ* రామనాథంగారి భార్య సుభద్రమ్మ వారికి అనూరాధ, లక్ష్మి సుందరి, శోభ అనే నల్గురమ్మాయిలు, రమణ అనే అబ్బాయి ఉన్నారు అనూరాధకు పెళ్లి సంబంధాలు చూస్తూంటారు రామనాథంగారు

ఏమిటో! ఎప్పుడూ వెధవ దరిద్రమే! ఎదిగిన ఆడపిల్లలకి రెండేసి జతల గాజులయినా చేయించలేక పోయాం!' అనుకుంది సుభద్రమ్మ కాస్తో కూస్తో మిగిలినదంతా కట్నాలకోసం డిపాజిట్ చెయ్యటంతోటే సరిపోతున్నది

ఆవిడ పెద్ద అంచువున్న నీలం వెంకటగిరి చీర కట్టుకుంది వయసు మళ్ళినా సుభద్రమ్మదికూడా కళగల రూపం ఆవిడకి చిన్న వయసులో పెళ్లి అయింది 16 ఏళ్లకే ఎల్లనెత్తుకుంది అంతా దగ్గర దగ్గర కాన్పులు అనూరాధకి పందొమ్మిది లక్ష్మికి పదహారు వెళ్లిపోతున్నాయి సుందరి స్వీట్ ఎక్స్‌టీన్ !

ఇంతలో బయట ఆడుకుంటున్న ఆరేళ్ల బాబీ అమ్మా! వాళ్లు వచ్చేస్తున్నారు టాక్సీ వచ్చింది అంటూ పురుకులు పరుగులు మీదవచ్చి మళ్లీ అదే వేగంతో వీధిలోకి వెళ్లిపోయాడు ఆడపిల్లలంతా గబగబా లోపలికి వచ్చేశారు సుభద్రమ్మ కొంగు భుజం నిండా కప్పుకుని ఇవతలకి వచ్చింది పెళ్లివారు లోపలికి వచ్చారు పలకరింపులు అయ్యాయి సుందరి లోపల్నుంచి మెల్లిగా తొంగిచూసి ' ఈ రమణగాడు అప్పుడే డాక్టరు గారితో కబుర్లు మొదలెట్టాడేవ్! బాడీ గార్డులా ఎలా నుంచున్నాడో చూడు అంది అక్కగారితో

ఎందుకో హాల్లో నవ్వులు వినిపించాయి ఆరోజు వాళ్లు వస్తున్నారని బజారునుంచి ప్రత్యేకం స్వీట్సు తెప్పించారు ఇంట్లో బూందీ బజ్జీలు చేసింది సుభద్రమ్మ

రమణ ముఖం వెయ్యి ఓల్టుల బల్బులా వెలిగిపోతున్నది

డాక్టరుగారు చాలా బావున్నారక్కా'' అంటూ లోపలికి వచ్చి అక్కగారికి వార్త చేరేసాడు

'అప్పుడే సోది మొదలెట్టావుగా నువ్వు'' అంది అక్కసుగా లక్ష్మి

''ఒరేయ్! అసలుబావగారు నీతో మాట్లాడారురా! లేక నీ వాగుడేనా ' అంది సుందరి

'పోవే! నీ కంటే నేను పనికిరాను గాని ఎందుకు మాట్లాడరు ?''అంటూ ఏదో పని వున్నట్టు బయటికి వెళ్లాడు

కాఫీ టిఫిన్లు పూర్తి అయ్యాయి వాళ్లు

వచ్చిన అరగంటకి అనూరాధని హాల్లోకి తీసుకొచ్చి కూర్చోబెట్టారు పెళ్లికొడుకు తండ్రి మేనమామ కూడా వచ్చారు ఆడవాళ్ళు ఎక్కువ రాలేదు పెళ్లికొడుకు చెల్లెలు సుందరి ఈడుది ఒక పిల్ల వచ్చింది

— పుది పేర ౖలా ఆ పిల్ల ఎందుకో '
అంది చిన్నగా లక్ష్మి

వూరుకోవే! అని కసిరింది అనూరాధ

పేరేమిటు? వంటవచ్చా? అంటు అతి మామూలయిన చప్పు ప్రశ్నలన్నీ అడిగాడు పెళ్లికొడుకు మేనమామ. ఆయన కూతుర్ని పెళ్లికొడుకు తమ్ముడికి ఇస్తారుట ఆయనే మాటల్లో చెప్పాడు పెళ్లికొడుకు కూడవ వాడు

'మీ అమ్మాయి 'హాబీస్' ఎమిట ?' అని అడిగాడు పెళ్లికొడుకు తండ్రి

ఎద్నా హాబీస్ ఎంపుంటాయి చెప్పండి ఇంటిపన్లు అన్నిచాతనవును రెండు సంవత్సరాల పాటు అమ్మాయికి సంగీతం చెప్పించాను అని రామనాథంగారు చెప్పగానే ఎదీ ఓ పాట పాడు తల్లీ అన్నాడాయన

అలా నలుగురులోనూ పాడటం ఇప్పటికి కొన్ని అలవాటయిన మూలాన్న ఆట్టే మురి ఎంచుకోకుండానే కంఠం విప్పగలిగింది అనూరాధ

నగుమోము కనలేని ' అని 'అభేరి రాగంలో చిన్న కీర్తనపాడింది గగనానికిలకు అంటూ సాహిత్యాన్ని ఖూనీ చేస్తూ కాకుండా సాహిత్యం చెరకుండా గగనానికి ఇలకూ బహుదూరం అనినాడో అంటూ చక్కగా పాడంది సంగీతంలో గొప్ప ప్రతిభ లేదు అనూరాధకి ఎక్కువగ సంగతులు వేస, చక్కగ రాగాలాపన చెయ్యలేదు కాని అపశ్రుతులు రాకుండా శ్రావ్యంగా పాడగలదు కోకిల ఎగు పడాల్సినంత మంచి కంఠం అనూరాధది అవకాశం లెదు కాని మధురగాయనిగ పేరు ప్రఖ్యాతులు పొందగలిగేటంతటి మంచి గాత్రం ఆమె పాటపాడిన కాస్సేపు పెళ్ళికొడుకు శ్రీనివాస్ దీక్షగా ఇంటి ఎప్పోస చూశాడు అతనికి క్లాసికల్' అంటేఇష్టం లేదు, ఏవైనా సినిమా పాటలు ఫారిన్ మ్యూజిక్ అంటేనే కొంచెం ఇంట్రస్టు చూపుతాడు

' మా రామనాథం పిల్లలని చెప్పటం కాదుగాని వాడిసంతానం అంతా గుణవంతులు పనివంతులు ఇంక రూపలావణ్యాలు మీరు చూస్తూనే వున్నారు ఈ కాలం పిల్లలకిమల్లే అహంకారంలేదు అన్నాడు మధ్యవర్తి '

ఆ విధంగా పెళ్ళిచూపులు ముగిశాయి ఏసంగతీ త్వరలో వుత్తరం వ్రాస్తామని చెప్పి లేచారు

* * *

లక్ష్మి ఎ యు ఎ సా ౦ యి ఇంట్లో కూచున్నది అనూరాధ పెళ్లి కుదిరిన వెంటనే ఆమెకి కూడా మేనబావలో పెళ్లి అయిందని ఎస్తారు తరువాతది సుందరి ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతోంది డబ్బు ఇబ్బందులు ఎప్పుడూ వున్నవే! అని చెప్పి కాలేజీలో చేర్పించారు నాలుగవది శోభ ఆపిల్ల ఏడు చదువుతోంది తరువాతి ఇద్దరు మగపిల్లలు మిడిల్ స్కూలుకి వెడతారు

ఇక్కడ సుందరి గురించి కొంచెం చెప్పాలి ఎందుకంటే నలుగురాడపిల్లల్లోకి సుందరి కొన్ని హుషారైన ఎట్టా ఆధునిక అలంకర






ణాలపై మోజు ఎక్కువ! సాహిత్యాభిమాని, పత్రికలు, నవలలు, క్లాసు పుస్తకాలకంటె ఎక్కువగ చదువుతుంది అస్తమానం ఏదో ఒక సినిమా పాట పాడుతూనే వుంటుంది అసలు ఇప్పుడు వచ్చే సినిమా పాటలు

## లా ల స

ఎలాంటివి? అవి తిరిగి పాడుకునే టట్లే వున్నాయా? అయినా అరిగిపోయిన రికార్డులా పాడుతూనే వుంటుంది సుందరి. "ఏదో.. ఏదో అవుతున్నది. ఇదే ఇదే బాగున్నది" అని పాడినప్పుడల్లా తల్లి నోటిమీద వాత పెడుతూనే వుంటుంది

"ఏమిటి అయ్యేది! నీ పిండాకుడు వెధవ పాటలూ నువ్వూను ఊడొచ్చిన పిల్లవి, అవేనా పాడవల్సింది" అని తిడుతుంది. అయినా "ఎప్పటికెయ్యేది ప్రస్తుత" మన్నట్లు నోరుమూసినా మళ్ళా ఆ ల్లికి తెలియకుండానే అటువంటిదే ఏదో ఒకటి అందుకోక మానదు అసలు ఒక్క పాటే అన్నమాట ఏమిటి? సుందరి చేసే ప్రతి పని ఇట్లా విమర్శనాత్మకంగానే వుంటుంది ప్రతీది ఎత్తి చూపించే విధంగానే ప్రవర్తిస్తుంది. అందరికి ఏడాది వచ్చే చెప్పుల జత ఆ పిల్లకి ఆరునెల్లు మాత్రమే వస్తాయి బెల్టు వూడిపడేలా నేలకి తాటిస్తూ నడుస్తుంది.

"ఆడపిల్ల భూమి చప్పుడయ్యేలా నడిస్తే

దరి(ద్రం,'' అని తల్లి ఎంత చెప్పినా ఆ అల వాటు మానుకోలేక పోతోంది ఇంట్లో ఇక్కడి చెంబు తీసి అక్కడ పెట్టదు ''ఇప్పుడంటే లక్ష్మి, అనీ వున్నారు గనుక ఫరవాలేదు రేప్పొద్దున్న వాళ్ల అత్తారింటికి వెళ్లినా అంతేనా'' అంటుంది తల్లి ఖర్మకాలి ఇంటో తల్లి అక్కలు బయటచేరి ఏ ఒక్క పూటో ఇబ్బంది వస్తే సుందరి వండే వంట ఆ ఖుంట్లో నోట పెట్టుకోలేరు అంతటి పాకశాస్త్ర (ప్రావీణ్యురాలు ! అందు కే 'హోమ్‌సైన్సు' తీసుకోమని అన్నగారు సలహా ఇస్తే అది చదువే కాదన్న ట్లు మాట్లాడి 'లాజిక్' తీసుకుని తన (ప్రత్యేక తని నిరూపించుకుంది

రెండు జడలూ ఏ వేళా ముందుకి పడి వుండాల్సిందే ! నడుం దిగని ఆ పొట్టి పైట అస్తమానం భుజం మీంచి జారిపడి అందరి కనులకి విందు చేయాల్సిందే ! పొడుగ్గా తగిన లావుతో వుంటుంది సుందరి హైహీల్సు వేసుకుని నిటారుగా నడుస్తుంది .

''అట్లా రొమ్ము విరుచుకుని మగ రాయుడిలా నడవకపోతే కాస్త ఒంగి నడవ లేవే!'' ఒక్క గుద్దు గుద్దితే దెబ్బకి గూని రావాల్సిన మాట అంటుంది తల్లి. సుందరి చేష్టలు ఆవిడకి ఒళ్ల మండిస్తూ ఖ అస్తమానం సతాయిస్తూనే వుంటుంది. ఒకోరోజు చేతులు పొడుగ్గా వేసుకుంటుంది ఒకోసారి పొట్టిగా . అసలు 'స్లీవ్‌లెస్' వేసుకోవాలని ఆ పిల్ల అభిలాష కాని కొంచెం తండ్రికి భయపడి మానేసింది జాకట్టులో సగం మెడ కత్తిరింపుకే పోతుంది ఏ జన్మానా చేతులకి గాజులేసుకోదు పగిలి పోయాయంటుంది రెండున్నర ఫేట్ని మేచింగ్సుకి బొట్లు కొన్నది ఎర్రగ ఇంత తిలకం పెట్టుకుంటే అందం గాని ఇదెక్కడి ఫేషన్నమ్మరా బాబూ అని సుభద్రమ్మ మొత్తు కోని రోజు లేదు.

(ఇంకావుంది)

# హైదరాబాద్ నోట్‌బుక్ —తిరుమల రామచంద్ర

(ప్రపంచ తెలుగు మహాసభ :

(ప్రపంచంలోని వివిధ (ప్రాంతాలలో వున్నతెలుగు వారిని, తెలుగు భాషాభిమానులను ఒకచోట సమా వేశపరచి, (ప్రపంచ భాషలలో తెలుగుకు గలస్థానాన్ని తెలుగు సంస్కృతి విభవాన్ని పరిశీలించి, వివిధ (ప్రాంతాలలో తెలుగుభాషా సంస్కృతుల వికాసా నికి తోడ్పడే కార్య(క్రమాల నిర్ణయాలను చేయడా నికి వచ్చే ఉగాదినాడు రా(ష్ట్ర(ప్రభుత్వం యాజ మాన్యంలో (ప్రపంచ తెలుగు మహాసభలు రాజధానిలో వైభవోపేతంగా జరుగుతాయని విద్యాశాఖామం(త్రి (శ్రీ మండలి వేంకటకృష్ణరావు ఆగస్టు 29న ప(త్రికా (ప్రతినిధుల గోష్ఠిలో తెలిపారు ఈ మహాసభోత్స వాలు వారంరోజులపాటు జరుగుతాయి ఆం(ధ (ప్రదేశ్‌లోని (ప్రముఖులతో ముఖ్యమం(త్రి అధ్యక్ష తన ఆహ్వాన సంఘం ఏర్పాటయింది ఆహ్వాన సంఘ కార్యనిర్వాహక సంఘానికి విద్యామం(త్రి అధ్యక్షులు మహాసభ కార్యనిర్వాహణ సంఘానికి శాసన సభాపతి (శ్రీ పిడతలరంగారెడ్డి అధ్యక్షులు డాక్టర్ పి ఎస్ ఆర్ అప్పారావు కార్యదర్శి (శ్రీ దేవులపల్లి రామానుజ రావు కోశాధికారి ఒక సమన్వయ సంఘం, 19 ఉప సంఘాలు ఏర్పడ్డాయి తెలుగు సంస్కృతి, చరి(త్ర, భాష మొదలయిన వాటిని గురించిన (గంథాలు (ప్రచురించబడుతాయి ఒక (ప్రత్యేక సంచిక (ప్రచురణ, గోష్ఠులు, సదస్సులు, (ప్రదర్శనలు మరి కొన్ని (ప్రత్యేకతలు ఈ మహాసభలకు విదేశాలనుండి దాదాపు 200 మంది, దేశంలోని పలు(ప్రాంతాల నుండి వేయిమంది (ప్రతినిధులు రావచ్చునని మం(త్రి (శ్రీ మండలి వేంకటకృష్ణరావు తెలిపారు

భాగ్యలక్ష్మి లాటరీ

ముఖ్యమం(త్రి (శ్రీ వెంగళరావు ఆగస్టు 30న జూబిలీహాలులో రా(ష్ట్ర(ప్రభుత్వం నిర్వహించే ''భాగ్యలక్ష్మి లాటరీ''కి (ప్రారంభోత్సవం జరుపుతూ, (ప్రణాళికా కేటాయింపులకు అదనంగా వనరులు సంపాదించి, సంక్షేమ కార్య(క్రమాలు నిర్వహించ డం కోసం ఈ లాటరీ (ప్రారంభించామన్నారు ఈ ఉత్సవానికి విజిలెన్స్ కమీషనర్ (శ్రీ వి కె రావు అధ్యక్షత వహించారు ఈ లాటరీ డైరెక్టర్ (శ్రీ ఎస్ ఎన్ ఆచంట మొత్తం లాటరీ టికెట్లు 40లక్షలు 40 లక్షల రూపాయిల విలువగలవి 18 వేలమంది, బహుమతి పొందే అవకాశం ఉంటుంది (ప్రతి200 టిక్కెట్టుకు ఒక బహుమతి ఉంటుంది

ఉపేం(ద్ర శుక్ల మహారాజ్ •

ఒకప్పుడు హైదరాబాద్ మునిసిపల్ కార్పొ రేషన్‌లో సామాన్య ఉద్యోగిగా ఉన్న వ్యక్తి, నేడు, మహాయోగి అయ్యాడంటే,ఎవరికైనా ఆశ్చర్యం కలు గుతుంది అవును ! అట్లాగే జరిగింది (శ్రీ ఉపేం(ద్ర శుక్ల మహారాజ్ ఆ వ్యక్తి ఈయన గుల్జార్‌హవుస్ సమీపంలో 'పంజేశాహాదేగ్‌బీ గలీలో' ఐదు శతాబ్దా లుగా అనువంశికంగా వచ్చిన ఇంట్లో ఉంటారు హైదరాబాద్‌లోని కాయస్థులకు, తదితరులకు వీరిది గురువంశం గుజరాతీ మాతృభాష మరికొన్ని భాషలూవచ్చు సమున్నత శరీరం 45 సంవత్సరాల నడివయస్సు భుజాలపై జీ రాడే నల్లటి గిరజాల జుట్టు, నల్లటి గడ్డం—విశాల ఫాలం, ఎదుటి వారిని సూటిగా కళ్లలోకి చూచే పెద్దకళ్ళు, పసిపాపల అమాయకమైన నవ్వు—ఎవరికైనా ఈయన గొప్ప తత్త్వవేత్త అనిపిస్తుంది రెండు దశాబ్దాలుగాతపస్సు చేస్తున్నారు ఈ విధంగా ''ఇంత తత్త్వవేత్తలు కదా మీరు ! ఈ చండీపూజలెందుకు ?'' అని (ప్రశ్నించాను ''ఈ పూజ (ప్రజలను ధర్మంవైపు ఆక ర్షించడానికి ఒక అంగం నాకు మనుష్యులు ముఖ్యం

( 40వ పేజీ చూడండి)



ఇటీవల వరంగల్‌లో జరిగిన (శ్రీ పి. వి రమణ రాసిన ''దేవత లెత్తిన పడగ'' నాటకం పుస్తకం ఆవిష్కరణ, అంకిత సభలో (ప్రసంగిస్తున్న డా సి నారాయణరెడ్డి, (శ్రీయుతులు పి వి రమణ, నేరెళ్ల వేణుమాధవ్, రా(ష్ట్రమం(త్రి భాట్టం (శ్రీరామమూర్తి, డా బి. రామరాజు, బి జనార్దనరెడ్డిగార్లని చి(త్రంలో చూడవచ్చు

"అమ్మా మాధవి కాలేజీకి వెళ్లలేదా ?" అంటూ గదిలోకి వచ్చారు పరంధామయ్యగారు

పుస్తకం ముందు పెట్టుకుని పరధ్యాన్నంగా కూర్చున్న మాధవి వులిక్కిపడింది ఆయన్ని చూసి కంగారుగా లేస్తూ "లేదండి ఒంట్లో బాగుండలేదు" అంది

"అదేంటమ్మా యింత చదువూ చదువుతూ ఆరోగ్యం జాగ్రత్తగా ఛూసుకోకపోతే ఎలా చెప్పు ?" అంటూ కుర్చీ లాక్కుని కూర్చున్నారు

"అబ్బే . అదేమీ లేదండి ఏదో కాస్త తలనొప్పిగా వుంది అంతే" మాటలు తేల్చేసింది మాధవి

"మందు ఏమైనా తీసుకున్నావా అమ్మా"

"ఎందుకండీ అదే తగ్గిపోతుంది" అంది యిబ్బందిగా




అలా అని వూరుకో కూడదు తల్లీ ఏ ఏస్ప్రో మాత్రో తీసుకుంటే త్వరగా తగ్గి పోతుంది వుండు నా దగ్గర ఏమైనా వున్నాయేమో చూస్తాను"అన్నారు.

"మాత్రలేక కాదండీ నా దగ్గరవుంది. కాసేపు పోయాక వేసుకుంటాను"

ఆయన మాత్ర తెచ్చి ఎక్కడ మ్రింగ మంటారో అని గాభరాపడి అలా అంది కాని నిజంగా తలనొప్పి వుండి వుంటే సంతోషించే దేమో

"రాత్రి చాలాసేపు చదివినట్లు వున్నావు కదమ్మా అందుకే తలనొప్పివచ్చినట్లుంది" అన్నారు

"అబ్బే ఎక్కువసేపు చదవలేదండీ లైట్ ఆర్పటం మర్చిపోయాను" అంది

'అయినా రాత్రుళ్లు అంతసేపు మెలకువగా వుండటం ఆరోగ్యానికి మంచిది కాదమ్మా—మావాడూ అంతే పగలంతా బలాదూర్‌గా తిరగటమూనూ—రాత్రుళ్లు చదవటమూనూ— ఒక ప్రక్క కళ్లు మూతలు పడుతుంటె చదువు ఏం ఎక్కుతుంది చెప్పు— బుర్ర పాడు చేసుకోటం కాకపోతే"అని కొన్ని క్షణాలు మౌనంవహించారుపరంధామయ్యగారు

"అదేమిటోకాని ఈ మధ్య మా గోపీగాడి ప్రవర్తన చూస్తుంటే నాకు చాలా భయంగా వుందమ్మా అసలు ఏం చెయ్యాలో తోచటంలెదనుకో" అని తిరిగి ప్రారంభిస్తూ వెర్రి చూపులు చూశారు

"అదేమిట అంకుల్ అలా అంటున్నారు"

"చెప్పటానికేముందమ్మా వాడు చాలా చెడిపోయాడు"అన్నారు బాధగా

"మిరు ఏమైనా అనండికాని గోపీ చెడి పోయాడంటే నేను వప్పుకోను" అంది మాధవి

"నీకు తెలీదు తల్లీ శ్రద్ధగాచదివి వాడు 'లా' డిగ్రీ తెచ్చుకుంటాడనే నమ్మకం నాకు లేదు"

"ఎందుకని"

"చెప్పటానికేముంది ఎవరినో ప్రేమిస్తున్నాడు' ముఖం అదొకలా పెట్టారు పరంధామయ్యగారు ఫక్కున నవ్వింది మాధవి. పరంధామయ్యగారు వులిక్కిపడ్డారు

"ఎందుకమ్మా నవ్వుతావు" అన్నారు

# ఇది మీ హృదయాన్ని స్పందింప జేస్తే అది ఒక విలువైన ఫోటోగ్రాఫే !



# ఆగ్ఫా ఐసోలి I తక్కువ కాంతిలో అందమైన ఫోటోల కాణాచి

ధర
రూ 162/50
ఎక్సైజు సుంకంతో
సహా మిగతా పన్నులు
అదనం

ఆగ్ఫా ఐసోలి I కొన్ని కారణాలు దీన్ని పరిణతి పొందని ఫోటోగ్రాఫర్‌కి క్రొత్త అవకాశాలు కలిగించేదిగా చేస్తున్నాయి

1 మూడు షట్టర్ స్పీడ్ సెట్టింగ్స్ కల్గిన వివరును ఉపయోగించటం సులభం
2 ఆ క్రోమెట్ F8 లెన్స్ కాంతివంతమైన చురుకైన చిత్రాల కోసం
3 ప్రతికూలమైన పరిస్థితులలో తీసిన ఫోటోలకు గూడ సరియైన ఎక్స్పోజర్ ఇచ్చుటకు 2 లెన్స్ స్థాపులు
4 ఫిలిమ్ చుట్టే నాబ్ ప్రత్యేకమైన లాకింగ్ సాధనంతో రెండు సార్లు ఎక్స్పోజ్ కాకుండ కాపాడుతుంది



5 120 సైజు రోల్ ఫిలిమ్ మీద 16 (4 × 4 సెం మీ ఫోటోలు 6 × 6 సెం మీ) సైజు కంటే 4 ఎక్కువ ఇస్తుంది

ఆగ్ఫా ఐసోలి I ప్రొజెక్షన్ కోసం మెరిసే ఆగ్ఫా కలర్ ట్రాన్స్పరెన్సీలను కూడా తీసుకుంటుంది సుస్పష్టమైన ప్రింట్లకు మరియు ఎన్‌లార్జిమెంట్లకు ఎప్పుడూ ఆగ్ఫా గెవార్ట్ ఫోటో పేపర్లనే కావాలని అడగండి

తయారు చేయువారు న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్ బరోడా

ఆగ్ఫా గెవార్ట్ అధీకృత విక్రయదారుల అందరివద్ద దొరుకుతాయి




సోల్ డిస్ట్రిబ్యూటరు:
ఆగ్ఫా గెవార్ట్ ఇండియా లిమిటెడ్
మర్కంటైల్ చాంబర్స్ 41 న్యూ మెరైన్ లైన్స్ బొంబాయి 400 020
బ్రాంచీలు బొంబాయి క్రొత్త ఢిల్లీ కలకత్తా మద్రాసు
● ఫోటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన ఆగ్ఫా గెవార్ట్ ఆంట్వెర్ప్ లెవర్కూసెన్ యొక్క రిజిస్టర్డు ట్రేడ్‌మార్కు.

SIMOES/AG/33 TEL

## అ బ ల

"అదికాదు అంకుల్ మీకెలా తెలిసిందా అని" మాటలు సర్దుకుంది

"ఒకళ్లు చెప్పాలటమ్మా, వాడి ప్రవర్తనే చెప్తుంది"

"అంటే " నవ్వు ఆపుకోటానికి ప్రయత్నించింది

"నీకు అర్థంకాదమ్మా అయినా పెళ్లి కాని ఆడపిల్లల దగ్గర యిలాంటి విషయాలు ఎత్తకూడదు ఆ గొడవలన్నీ ఎందుకు కాని కాసేపు రెస్ట్ తీసుకోమ్మా నేను వెళ్తాను"

"నాకేమీ వూసిపోవటంలేదు కాసేపు కూర్చోండి అంకుల్" అంది

ఆయన వెళ్లే ప్రయత్నం విరమించారు

"గోపీతో గట్టిగా చెప్పేయలేకపోయారా" ఆ ప్రేమకథ ఏమిటో తెలుసుకోవాలని కుతూహలంగా అంది

"గట్టిగా చెప్తే వినే వయసా తల్లీ ఆ బుద్ధి వాడికే వుండాలి"

'అలాఅనిచూస్తూ వూరుకుంటారామరి?'

"చెప్పినా అలా జరగటానికి వీల్లేదు" ఆవేశపడ్డారు

"పోనీ అతనికి నచ్చిన అమ్మాయినే పెళ్లి చేసుకోనీ కూడదూ?" మాటలు పెంచుకుంది మాధవి

"ఎంత తేలికగాచెప్పావు తల్లీ పెళ్లంటే మీ కంతచులకనై పోయిందన్నమాట"

"అది కాదు అంకుల్"—సర్ది చెప్పటానికి ప్రయత్నించింది మాధవి

"చూడమ్మా ఎవరో కులం, గోత్రం లేని అమ్మాయిని వీడు పెళ్లి చేసుకుంటానంటే చూస్తూ వూరుకోలేను వాడుకాదని ఆపని చేశాడంటే నా తల తీసేసినట్లేమరి అంత జరిగాక మళ్లీ నలుగురిలో తల ఎత్తి తిరగగలనంటావా చెప్పు?" పరువంతా వరదలు వచ్చి కొట్టుకుపోతున్నట్లు బాధపడ్డారు ఆయన మాధవి మాటలు పొడిగించలేకపోయింది

* * *

మాధవి మంచంమీద వాలిపోయింది పరంధామయ్యగారి మాటల్ని మననులో నే మననం చేసుకుంటోంది. ఏ కారణంచేత ఆమె కాలేజీ మానేసిందో ఆయనకు తెలీదు ఎవరికీ తెలియవలసిన అవసరం లేదు అనుకుంది అప్పటివరకూ కాని యిప్పుడిప్పుడే అనిపిస్తోంది ఆమెకు—ఏ మనిషీ తన బాధల్ని తనలోనే దాచుకోలేడని ఆయన ఆరాటం, ఆవేదన విన్నాక తనుకూడా తన బాధల్ని ఎవరికైనా చెప్పుకోవాలనిపిస్తోంది అలాగైనా కాస్తంత ప్రశాంతి మిగుల్తుందేమో అనుకుంటోంది కాని మనసువిప్పి చెప్పుకోటానికి తనకు ఎవరున్నారు గనుక? అలాంటి బాధల్ని ఎవరితో చెప్పుకోగలదు? చేసేదిలేక మనసులోనే దాచుకుని కృంగిపోతుంది

విధి ఆమె జీవితంలో తిప్పిన పేజీల్ని వెనక్కుతిప్పి చూసుకోటం ఒక్కటే ఆమె చేయగలిగిన పని అయ్యింది—

ఆరోజు—

"మాధవీ జస్ట్ ఏ మినిట్ " అని పిలిచాడు గిరి

వార్డ్ నుండివస్తున్న మాధవి అతనిపిలుపు విని ఆగిపోయింది అదోకలా చూస్తూ

"ప్రొఫెసర్ క్లాస్ తీసుకున్నారో లేదో కనుక్కుందామని"అంటూనవిగాడు

"ఆ తీసుకున్నారు"అంటూ ముందుకు నడిచింది

"దెన్ అయ్ హేవ్ మిస్డ్ ఏ లాట్ " అంటూ నవ్వి ఆమెను అనుసరించాడు

కాని మాధవి మాత్రం మాటలు పెంచుకోలేదు చురుకుగా ముందుకు వెళ్లిపోయింది

అయినా గిరి నవ్వు మాత్రం మర్చిపోలేకపోయింది అతను తనని చూసినప్పుడల్లా ఏదేదో మాట్లాడి ఎందుకలా నవ్వుతాడో ఆమెకి అర్థం కాలేదు ఎప్పుడూ క్లాసులికి రాకుండా — వార్డులో అటెండెన్స్ యిచ్చి కాంటీన్‌లో కూర్చుని ఏంచేస్తుంటాడో ఆమె వూహించ లేకపోయింది అంత శ్రద్ధ లేనప్పుడు మెడిసిన్ చదవటం దేనికి — స్కూటరు మీద తిరుగుతూ — సిగరెట్లు కాలుస్తూ జల్సాచేయటానికేనా —అనుకునేది ఆమెకు తెలిసినంతవరకూ గిరి ఆ కేటగిరిలో వాడే అందుకే అతనితో మాట్లాడటం అంటే ఆమెకు యిష్టం వుండదు తనంతట తానుగా అతనితో ఎప్పుడూ మాట్లాడలేదు— అయినా ఎప్పుడూ ఆమెనే పలకరిస్తుంటాడు గిరి క్లాస్ మానేసి "ఏం పాఠం చెప్పారండి" అని ఆమెనే అడుగుతాడు అలా చెయ్యటంలో అతని వుద్దేశ్యం ఏమిటో ఆమెకు యింత వరకూ బోధపడలేదు

(32వ పేజీ చూడండి)

# అద్భుతమైన- ఆదా బిజ్ వల్ల



అత్యుత్తమమైన
మళ్లీ మళ్లీ వాడదగిన
ప్లాస్టిక్ డబ్బా'
మొదట, ఒక్క పైసా యైనా అధిక
ఖర్చు అక్కర్లేకుండా(బిజ్ ను
మళ్లీ మళ్లీ వాడదగిన
ప్యాక్‌లో తీసుకోండి

2 అత్యుత్తమ
పొదుపైన ప్యాక్‌లు'
తరువాత, **బిజ్** ను 5 రిఫిల్ లేక
2 రిఫిల్ ప్యాక్‌ల నుంచి మళ్లీ
మీ ప్యాక్‌ను నింపుట వల్ల
అద్భుతమైన ఆదా
చేసుకోండి

త్వరగా నురుగు నిచ్చే,
శీఘ్రంగా శుభ్రపరచే **బిజ్** అమోఘమైన
వివిధోపయుక్తమగు శుభ్రపరచే పౌడర్
మీ వంట ఇంటి సామాను, గాజు సామాను,
నేలలు మరియు స్నానాల గదులు ఇంతకు
ముందెన్నడూ లేనంత తళతళ మెరయు
చుండునట్లు చేస్తుంది మీకు ఇంతకు
ముందెన్నడూ లేనంత అద్భుతమైన
ఆదా కూడ




**బిజ్ గోద్రెజ్ ఉత్పాదన**

CMGS 60 234 T'

# పుత్తడి బొమ్మ

సీరియల్

## రామవరపు వేణుగోపాలరావు

4

*[గత సంచిక తరువాయి]*

కొంసేపు మౌనంగా వున్నారిద్దరూ

హోరున గాలీ వానా వచ్చి వెలిసిననాటి సాయంత్రంలా తోచింది రవికి, ప్రస్తుత వాతావరణం! అంతవరకూ ప్రశ్నలవర్షం కురిపించిన రజని ఇంకా మౌనంగానే తల వంచుకుని కూర్చుంది మాటల సందట్లో పడ్డ రవికి ఇంతవరకూ ఆమె రూపం సాకల్యంగా పరికించే అవకాశం కలగలేదు పరీక్షగా మేనగోడలి వంక చూశాడు

ఆనాటి రజని కాదీమె పరికిణీ జాకెట్టుతో అవ్వాయిచువ్వలా వరద గోదారిలా గంతులేస్తే, అల్లరిచేసే రజని ఎంతమాత్రం కాదు! ఈనాటి రజని బాగా పొడగరి అయింది వివిధమైన సౌందర్యాలు ఆమె అణువణువునా ప్రత్యక్షమయ్యాయి మొహం కోలాగానూ కాక, గుండ్రంగానూ కాక చక్కదనంతో మెరుస్తోంది తీరైన ముక్కు మున్నని చెంపలు నవ్వితే ఓ బుగ్గ అందంగా లొత్త పడుతోంది పట్టుదలని సూచించే ఫాలభాగం ఎర్రని పెదిమలు—మధురమైన ఆరాటాన్ని దేన్నో వ్యక్తం చేయడానికి వుబలాటపడే కన్నె పెదిమలు ఇవన్నీ ఒకోటీ ఒకో నిధి అనుకుంటే ఆ నిధికి బంగారు కిరీటం లాంటి కళ్లు మీనాల ఆకారంలో దిద్దిన కాటుక యవ్వన ప్రాదుర్భావాన్ని సూచిస్తూ, కౌమార్యానికి టాటా ఛీరియో చెప్పేసిన వున్నత వక్షస్థలం చక్కని నడుం అందమైన పాదాలు ఇదీ ఈనాటి రజని స్వరూపం!

ఉన్నట్టుండి రవి నవ్వేడు ఓరకంట అతన్ని గమనిస్తోన్న రజని తల ఎత్తి చూసింది

హైదరాబాద్‌లో 'లా' చదువుతూన్న మావయ్య గురించి ఆమె ఆలోచించని క్షణం లేదు చిన్నప్పుడు తెలిసీ తెలీని వయస్సులో తను అతనితో ఆటలాడింది పాటలు పాడింది అతన్ని తిట్టింది, కొట్టిందికూడా!

"ఒసే రజనీ, మావయ్యని పెళ్లాడ్తావుటే?" అని తల్లి అడిగితే తను 'ఛీ ఫో' అని గంటలతరబడి ఏడ్చి రాగాలు పెట్టేది తమిద్దర్నీ పక్క పక్కని నిలబెట్టి 'ఏమిరా వెధవా, మా రజన్ని పెళ్లాడ్తావా?" అన్న తల్లి ప్రశ్నకి 'ఓ' అంటూ చక్రాల్లా గుడ్లు తిప్పే రవి జవాబు విని తను ఎంతో వుడికిపోయేది అలకపాన్పు ఎక్కి తండ్రి బతిమాలితేగానీ దిగేదికాదు రవి అంటే తన భర్త అన్న భావం మనస్సులో మెదిలినప్పుడల్లా సిగ్గుతో కుంచించుకుపోయేది తను ఎందరు మగాళ్లనో చూసింది కాని రవి వేరు రవి వ్యక్తిత్వం వేసవిలో గోదావరిలా నిండైనది ప్రశాంతమైన అతని కనురెప్పల రక్షణలో యుగాలకి యుగాలే నిశ్చింతగా గడపవచ్చును ఇది రజని మనసులోని భావం!

"ఎందుకో ఆ నవ్వు?" రజని ప్రశ్న

"నువ్వు గుర్తొచ్చేవు"

'పాపం!"

"అసలు సంగతి చెప్తా విను స్కూల్లో వెయ్యమని ఆరేళ్లప్పుడు నువ్వు జోరీగలా ఒకటే గోల చేసేదానివి తీరా వేసేక బడికి వెళ్లనని మొరాయించేదానివి రెండు కంచాల చల్దన్నం తినేసి కడుపు నొప్పి ఇస్కూలుకి వెళ్లనూ-" అని ఏడ్చేదానివి అది జ్ఞాపకమొచ్చి నవ్వుకున్నాను"

"అలాగా పాపం? అప్పుడు తమరేకాబోలు నన్ను ఇస్కూలు'కి దిగబెట్టేవారు?"

"మరి ఎవరనుకున్నావ్? స్కూలువేపు నడవకపోతే ఏం చేసేవాడినో తెలుసా?"

"ఏం చేసేవారేమిటీ?"

"ఎర్రమూర గట్టిగా ఒకటి ఇచ్చుకునేవాడిని"

సిగ్గుతో రెండు చేతుల్లోనీ చప్పన మొహం దాచుకొని నిశ్శబ్దంగా నవ్వుకుంది రజని అలా నవ్వుకున్న తర్వాత చాలాసేపు సూటిగా రవి కళ్లల్లోకి చూసింది కళ్లు మట్లాడే భాషే గనుక వస్తే ఆ చూపుని రవి ఇలా అర్థం చేసుకొనేవాడు

"ఎందుకు మావయ్యా, ఇన్నాళ్లూ రాలేదు? నీ కోసం, నీ మాటల కోసం ఎంత పరితపించేనో నీ కెలా చెప్పేది? నీ సాన్నిధ్యం కోసం ఎంతగా అల్లాడుతున్నానో చెప్పలేకే నాకు సిగ్గేస్తోంది ఇంతలా నేను నా మనసు చేసీ మారాం భరిస్తున్నాను గదా, నువ్వెప్పుడయినా, ఒక్కసారైనా నా గురించి ఆలోచించేవూ? ఒక్కసారి కనీసం ఒక్కసారి! మంచి పాట విన్నా, మంచి దృశ్యం చూసినా, మనసులో ఆనందం పొంగిపొర్లే ఏ వేళలోనైనా నువ్వు నాకు గుర్తొస్తూనే వుంటావు మరి నేను నీకలా గుర్తొచ్చేనా? నువ్వే లోకంగా, నువ్వే జీవంగా బతికే ఈ రజనిని కనీసం కలలోనైనా తల్చుకున్నావా, మావయ్యా?"

అంతలో జానకి రెండు చేతుల్లోనీ రెండు కాఫీ కప్పులతో వచ్చింది రవికీ, రజనికీ యిచ్చి తను కుర్చీలో కూర్చుంది

"అదేమిటె, మరి నీకో?" అన్నాడు రవి

'నేనూ బావా కాఫీ టీలు తాగడం మానేసి ఏడాది దాటిందిరా రవీ"

"భలే! పొదుపు వుద్యమమా ఏమిటి కొంపదీసి?"

"అదేం కాదురా కాఫీ టీలు తాగకూడదన్నాడు డాక్టర్ అంతే మానేశాం"

"హోమియోపతీ డాక్టర్‌గారేనా?"

"అవున్నా ఎంచక్కా మా రజని డాక్టరైతే, మరింక మరో డాక్టర్ దగ్గరకి వెళ్లం"

"నేనూ వెళ్లను"

ఇద్దరూ కాఫీ తాగడం ముగించేరు

"నీ చదువింకా ఎన్నాళ్లురా రవీ?"

"ఇంకో ఏడాది దాంతో హైదరాబాద్‌కీ నాకూ ఋణం తీరిపోతుంది" అని జవాబిచ్చేడు

"ఏ వూళ్లో బోర్డు కడ్తావు?"

"ఈ వూళ్లో మాత్రం ఛస్తే కట్టను అమ్మ బలవంతాన చదువుతున్నాను కానీ అసలు ఈ చదువంటేనే నాకు తల నొప్పిగా వుంది ఈ వూరు రావడమన్న ఆలోచన వస్తే చాలు మతే పోతుంది నాకు!"

"ఏదేంరా, నిక్షేపంలాంటి వూరు కదురా మనదీ?"

'ఆం నువ్వే పొగడాలి మనూర్ని!" మధ్యలో అంది రజని తల్లివంక చుర చుర చూస్తూ

"నాకీ వూరు వస్తే చాలు ఎచ్చి పడుతుంది ఉదయం నిద్ర నుంచి లేచిన దగ్గర్నుంచీ రాత్రి పడుకునేవరకూ అమ్మ ఆజ్ఞల్లో నడవాలి స్నానం,

*జరిగిన కథ 3* సరస్వతమ్మ వ్యసనపరుడైన భర్త క్షయవ్యాధితో మరణించటంతో ఒంటరి దవుతుంది కులం కానివాడిని పెళ్లి చేసుకున్న కూతురు జానకిని వెళ్లగొడుతుంది లా' చదువుతున్న రవి, పెళ్లి చూపులకు పోవ నిరాకరించగా బాధ పడ్తుంది కంబారి పుల్లిగాణ్ని దారుణంగా హింసిస్తున్న గవరయ్య బుగతని ఎదిరించి పుల్లిగాడ్ని విడిపిస్తాడు ధర్మయ్య తల్లి వద్దంటున్నా అక్క జానకిని చూడటానికి వస్తాడు రవి

పానం, భోజనం, నిద్ర  అన్నీ అమ్మ చెప్పినట్టు చెయ్యాలి  ఓ షికారుకి పోనివ్వదు  ఇష్టమైనవి తిననివ్వదు  ఎవరేనా ఇంటికొస్తే మాట్లాడనివ్వదు కాస్త ఏమండి, రాత్రి ఇంటికి వెళ్ళడం ఆలస్య మైతే — సవాలక్ష ఆరాలు తీసి  కోటి బుద్ధులు నేర్పుతుంది ''

''పాపం, నువ్వంటే దానికి ఎంతో అభి మానంరా !'' అంది జానకి జాలిగా

''ఆఁ పాపం పాపం ! నేనింకా చిన్న పిల్లాడి ననుకుంటుంది  లేకపోతే ఏమిటి చెప్పూ యిదంతా? ఏ స్వేచ్ఛా వుండదు  అందుకే నాకు హైదరాబాదే బావుంటుంది !'

''అవును మరి ! సెకండ్ షోలకి వెళ్ళినా, రోమియో వేషాలు వేసినా, జూలియెట్ల వెంట పడ్డా — అడిగేవాళ్ళుండ రక్కడ  ఆ వేషాలేం చెల్ల విక్కడ  అంతేకదు, మావయ్యా ?''

రవికి ఏదో చెప్పాలని వుంది  కాని, అది అతని పెదిమలు దాటి బైటికి రాలేకపోతూంది  తను నిజంగా అలాంటివాడు కాదనీ, తను హృదయంలో ఆరాధించేది రజనినేననీ, అతనికి చెప్పాలనే వుంది కాని, అక్కా, బావల ఆలోచన ఎలాంటిదో ? రజని కలలూ కోరికలూ ఏవో ? తనకింకా సరిగ్గా తెలీదు  ఏమని చెప్తాడు  అంచేతే అర్థంలేని నవ్వు నవ్వి వూరుకున్నాడు

''ఉండవే, నువ్వు మరీనూ మావయ్య అలాంటి వాడేం కాదు !'' అని కూతుర్ని మందలించి, తమ్ముడివేపు తిరిగింది జానకి

''అవున్రా రవీ, నీ గురించి అమ్మేమయినా పెళ్ళి మాటలు ఆడుతున్నాదీ ?''

ఆ మాటకి రవి ఉలిక్కిపడ్డట్టు అయ్యేడు  రజని గంభీర వదనంతో అతన్ని గమనించసాగింది  ఆకాశ మార్గంలో విహరించే కిన్నెర కన్నె ఎవరో అప్పుడే రవిని ఎత్తుకుపోయినంత ఆరాటం వుంది ఆమె గుండెల్లో

''ఇవాళ వుదయాన్నే పార్వతీశంగారమ్మాయిని చూసి రమ్మంది ''

''ఏదీ, మన ప్లీడరు పార్వతీశంగారి అమ్మాయి నేనా ?''

''అవును ''

''చూసేవా, మరి ?'

'లేదు  వెళ్ళనన్నాను  నాకు ఇప్పుడప్పుడే పెళ్ళి వొద్దన్నాను  అంటూ రజని వేపు చూసేడు రవి

ఒయ్యొయ్యో ! ఎంత పని చేసేవు మావయ్యా! అబ్బ వాళ్ళమ్మాయి ఎంతందంగా వుంటుందో, నేను చెప్పలేననుకో !  '' అని యింకా ఏమో చెప్ప బోతూంటే కూతుర్ని మందలించింది జానకి

''తప్పమ్మా  అలా అనకూడదే !'' అంది

''నువ్వుండమ్మా అడ్డు రాకు  మావయ్యా, భలే ఛాన్స్ పోయింది ప్చ్ ప్చ్  ఒక్కర్తే కూతురు లక్షలకొద్దీ ఆస్తీ, ఎత్తుపళ్ళ నల్లఎల్లా నీకు ప్రాప్తం లేదు  ఇప్పటికైనా మించిపోయింది లేదు  ఆ బొజ్జ ప్లీడరుగారిని శరణు వేడుకో  !'' అంటూ పకపక నవ్వసాగింది రజని

నిజమేనా అక్కా ?''

''అవున్రా  అమ్మ పెద్ద ఎత్తులోనే వున్నట్టుంది '' అని మాత్రం అంది జానకి ఆమె




కింకా చాలా మాట్లాడాలని వుంది  తమ సంగతీ, రజని సంగతీ చెప్పాలనుంది  తమ్ముడి హృదయ గతం ఏమిటో తెలుసుకోవాలన్న ఆరాటం వుంది  తన భర్తవుద్యోగరీత్యా ఎదుర్కొంటున్న ఇబ్బందుల్ని చెప్పాలని వుంది  కాని, యివన్నీ చెప్తే తమ్ముడు ఏం అనుకుంటాడో ? ఈ తమ్ముడు - ఆనాటి తమ్ముడు లవునో - కాదో ?!

అంతలో పెరటి తలుపు ఎవరో తట్టిన చప్పుడైంది

''కూరలవాడు కాబోల్రా  వుండు ఇప్పుడే వస్తాను '' అంటూ లోపలికి వెళ్ళింది జానకి

రజనివేపు చూశాడు రవి  అంతవరకూ రవిమీదే వున్న రజని చూపులు చేపల్లా పక్కకి తప్పుకున్నాయి

రవికి, నేలమీద ఓ మూలనున్న పలకా, బలపం కనిపించేయి  వాటిని చేతిలోకి తీసుకుని ''ఎవరివి ?'' అనడిగేడు

''ఎవరో కుర్రాడివి  నాన్న సాయంకాలంపూట ట్యూషన్లు చెప్తారుగా యిక్కడ '' అంది రజని

బలపం చేత్తో పుచ్చుకొని పలకమీద 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని రాసేడు రవి  రాసేక ''ఇది చదువుకో'' అని రజనికి అందించేడు  సీరియస్‌గా దాన్ని చదువుకుంది ఆమె

అంత సీరియస్‌గానూ — ''మావయ్యా, ఏదీ ఆ బలపం ఇలా యియ్యి !'' అంది

రవి చటుక్కున బలపం అందించేడు రజనికి

—

ఆనాడు గవరయ్య బుగతని ఎదిరించి, పుల్లి గాడిని విడిపించిన ధర్మయ్య ఈనాటి వరకూ ఇంటి గడప తొక్కలేదు  రాములు యధాప్రకారంగా బుగత యింటికి వెళ్ళి వస్తూనే వున్నాడు  కొడుకు మీద తనకున్న కోపం తండ్రిమీద చూపించాలని, రాముల్ని చూసిన గవరయ్య బుగత ఎన్నోసార్లు అనుకున్నాడు  కాని, ఎందుకేనా మంచిదని అప్పటికి మాత్రం కొద్దిగా తమాయించుకున్నాడు  'ఈ రావులుగాడి పిలక ఎప్పుడో సేతల కొచ్చిసింది  ఆ ధర్మిగాడి ఎలక సిక్కదా ?' అని అవకాశంకోసం ఎదురుచూడడం ప్రారంభించేడు  రాములు సంగతి గవరయ్య బుగతకి బాగా తెలుసు  వాడు చిన్నతనం నుంచీ తమ దగ్గర కంబారిగా వుంటున్నాడు

# వారఫలం

**మహేష్**

**27-9-1974 శుక్రవారం మొదలు**
**3-10-1974 గురువారం వరకు**

మేషం — మీ ప్రయత్నాలు ఫలిస్తాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది మీ తాలూకు వస్తువులు పోవచ్చును స్త్రీలకు — వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు అధిక వ్యయం జరుగుతుంది

వృషభం - స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల సంభాషణలను జరుప గలరు మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి సాహసిక వ్యవహారాలు బాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది పుణ్య కార్యాలు చేస్తారు

మిధునం - మీ కార్యక్రమాలు బాగుంటాయి సంతోషకరమైన సమాచారం అందుతుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ప్రయాణాలు వాయిదా పడతాయి స్త్రీలకు— బంధు మిత్రులను కల్సుకొంటారు విలాస వస్తువులు కొంటారు

కర్కాటకం - చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును వృత్తిలో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించ గలదు మిత్రులకు సహాయం చేస్తారు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు శుభకార్య విషయాలలో అనుకూలత లభిస్తుంది

సింహం - ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి సాటివారిలో గౌరవం బాగుంటుంది వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి అనవసరమైన వ్యయం చేస్తారు

కన్య — వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు సాంఘిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా వుంటాయి స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది దైవ కార్యాలు నెరవేరతాయి

తుల — వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి సాహసిక వ్యవహారాలు బాగుంటాయి అనవసరమైన సందేహాలు కలుగుతాయి ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును స్త్రీలకు — వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు సాటివారితో వాద ప్రతివాదాలు తగవు

వృశ్చికం — సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషి చేయవలసి వస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది మీ ఆలోచనలు ఫలిస్తాయి స్త్రీలకు — బంధు మిత్రులను కల్సుకొంటారు అలంకార వస్తువులు కొంటారు

ధనుస్సు — వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది వారం మధ్యలో స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ప్రయాణాలు వాయిదా పడతాయి స్త్రీలకు — అనుకూల వార్తలను వింటారు సాటివారిలో గౌరవం బాగుంటుంది

మకరం — రావలసిన డబ్బు అందుతుంది సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది స్త్రీలకు - కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

కుంభం — మీ కార్యక్రమాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది నూతన విషయాలను తెల్సుకొంటారు

మీనం - మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు మీ ప్రయత్నాలు లాభదాయకంగా ఉంటాయి స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది బంధుమిత్రులను కల్సుకొంటారు

---

గాడిదలా చాకిరీ చేస్తాడు కుక్కలా నమ్మకంగా పడివుంటాడు ఈనాటి వరకూ అలాగే పడివున్నాడు కూడా తన తండ్రి బ్రతికివుండే రోజుల్లో రాము లంటే ఎంత అభిమానం చూపించేవాడో గవరయ్యకి తెలుసు అంచేతనే ధర్మయ్య చేసిన పనికి రాములు నేమీ అనలేదు అసలా ప్రసక్తే ఈనాటి వరకూ రానియ్యలేదు ధర్మయ్య ఇప్పుడు పబ్లిక్ ఎనిమీ నంబర్ వన్ గవరయ్య బుగత వాడి నిన్నాళ్లూ తమ కంబారి కొడుకు ధర్మిగాడుగానూ, ఒట్టి వానపాము వాడు గానూ చూసేడు కాని కాదు ఎంతమాత్రం కాదు వాడు కొంపలుతీసే కొరివి రేకుల మాటున నక్కి ఎప్పుడేవా కాటెయ్యగల మొగలి నాగు ఈ ప్రాంతపు కూలీల సంఘానికి వాడే దన్ను ఎర్రజెండాలు పట్టుకుని మొలతాడు లేని బికారుల్తో సభలు చేస్తాడు 'నూసీ నూడ కుండా వుంటే ఏం నాబంనేదు సిన్న అగ్గిరవ్వేకదా అనూరుకుంటే, మన కొంపేకాదు, వూరు వూరే తగలెట్టి, ఆదీ సాలక అడివంతా మంటెట్టేస్తాడు రవ్వలా వున్నప్పుడే పాదాలకిందెట్టి అణిసెయ్యాలి మరింక, పాపనని ఆలోసించకుండా, ఆడి సంగతి తేల్చేస్తేగాని ఏటీ సెయ్యకూడదు!' అని ఎప్పుడో నిశ్చయించుకున్నాడు గవరయ్య బుగత అలా ఆ ప్రకారంగా ఓ నిశ్చయానికి వచ్చి అవకాశంకోసం, పురుగుని వేటాడబోయే బల్లిలా ఎదురుచూడ్డం ప్రారంభించేడు

ఒక రోజున —

అంతవరకూ నిర్మలంగా వున్న ఆకాశం హఠాత్తుగా మబ్బుల్తో నల్లబడింది వెర్రిగాలి వికృతంగా వీచింది మదించిన ఏనుగుల్లా మేఘాలు గాలికి పిచ్చిగా పరుగెత్తేయి మెరుపులు మెరిసేయి ఎక్కడో చెట్టుమీద పిడుగు కూడా పడింది గాలీ వానా భూమ్మీద స్వైరవిహారం చేస్తున్నాయి మెరుపులు మెరియనప్పుడు మబ్బులు ఖణేల్మంటున్నాయి దిక్కులేని వాళ్లందరూ ఒక చోట చేరి దిక్కులు పిక్కటిల్లేలా రోదిస్తున్నట్టు పురుములు పురుముతున్నాయి చీంటి పడి, అప్పటికి రెండు గంటలు దాటింది

ఆ రాత్రి ఎనిమిది గంటల వేళప్పుడు, ఆ భీభత్సమైన గాలివానలో పొలాలగట్లమ్మట రాములు నడుస్తున్నాడు నెత్తిమీద కర్రలేని తాటాకుల గొడుగుంది ఓ చేత్తో గొడుగు ఎగిరిపోకుండా పట్టుకుని, మరో చేత్తో మొహంమీద పడే వాన తుంపరల్ని తుడుచుకుంటున్నాడు కళ్లంలో పందిరి

## పుత్తడి బొమ్మ

కింద వుండిపోయిన నాలుగు జతల ఎద్దుల్నీ పశువుల పాకలో కట్టెయ్యాలి ఈ గాలివానలో రాములు చెయ్యాల్సిన పని అది అందుకోసమే చిరుగుల గొడుగుతో వానకి తడుస్తూ ఈదురుగాలిలో అలా పొలాల వెంబడి పడి నడుస్తున్నాడు

'కాలం కాని కాలంలో ఈ వొర్సమేటో!' అని విసుక్కుంటూ ఆశ్చర్యపోయాడు రాములు

మరో పావుగంటకల్లా సామ్మల్ని పశువుల పాకలో కట్టెయ్యడం, వాటి కింత గడ్డి పడెయ్యడం అయిపోయేక, ఇంటి దారి పట్టేడు తన గుడిసె కున్న తడిక తలుపుని తోసి లోపలికి అడుగు పెట్టేడు గొడుగు మూలని పెట్టి వజవజ వణుకుతూ, తడిసి పోయిన తలపాగానీ, బనీనునీ తీసి ఓ మూల పడేశాడు గావంచా చుట్టుకుని, పంచె కూడా తీసేసి నిలబడ్డాడు మాసిన పచ్చడంతో ఒళ్లంతా తుడుచుకుని, దీర్ఘంగా వూపిరి తీశాడు

గాలికి రెపరెప లాడుతున్న కోడిగుడ్డు దీపం వెలుగులో మలక మంచంమీద నోరు తెరుచుకుని నిద్రపోతున్న చుక్కమ్మ కనిపించింది రోజూ తను వొచ్చేవరకూ మేలుకుని కూర్చునే కూతురు ఇవేళ



# చెడు తలపులు

బులుసు వేంకటరమణయ్య

మనస్సు చాలా చంచలమైనది. సరియైన మార్గంలో దానిని పెట్టదలచినా, అప్పుడప్పుడు చెడ్డ ఆలోచనలు అందులో ప్రవేశిస్తూనే ఉంటాయి

పరమహంస శిష్యుడు ఒకడు తరచు భగవద్ధ్యానంలో నిమగ్నుడై ఉండేవాడు. కాని, అప్పుడప్పుడు చెడు తలపులు కలుగుతూనే వుండేవి. వాటిని ఎలా తప్పించుకోవడమో తెలియక అతడు తన స్థితిని గురువుగారికి తెలియజేశాడు,

శ్రీ రామకృష్ణులు ఇలా చెప్పారు —

"ఒకాయన ఒక కుక్కను పెంచాడు. అతడు దానిని ఎంతో బుజ్జగిస్తూ, ముద్దులాడుతూ, ఒళ్లో కూర్చోపెట్టుకునేవాడు. తాను ఎక్కడికి వెళ్లినా, తనతో తీసుకుని వెళ్లేవాడు. ఒకప్పుడు ఒక పెద్దమనిషి ఇది చూచి "కుక్క నీచజంతువు. మీరు ఎంత బుజ్జగించినా ఒకప్పుడు మిమ్మే కరవవచ్చు. దానిని దూరంగా ఉంచడమే మేలు" అన్నాడు.

ఆ మాటలు ఇతనికి నచ్చాయి. కుక్కను దూరంగా ఉంచడమే మంచిదని తోచింది. అది దగ్గరకు రాగా దూరంగా తోసివేశాడు. అయినా అది అతనిని విడవలేదు. అతడు దానిని కొట్టి తరిమివేశాడు. అయినా అది అతనిని వదలక దగ్గరగా చేరేది. — ఎన్నో దెబ్బలు తిన్నా. ఇలా కొది రోజులు గడవగా, అది తన యజమానుడుకి తన మీద ప్రేమ లేదని గ్రహించి, చల్లచల్లగా జారిపోయింది. తర్వాత అది అతనిని బాధించలేదు.

ఇలా జరగడం లోకం పరిపాటి.

ఆ విధంగానే "మన మనస్సులో అనవసరమైన ఊహలూ, చెడ్డ తలపులూ కలుగుతూ ఉండేటప్పుడు వాటిని తొలగించడానికి ప్రయత్నం చేస్తూనే ఉండాలి. ఆ విధంగా కొన్నాళ్ళ ప్రయత్నం చెయ్యగా, చెయ్యగా అవి పూర్తిగా తొలగిపోగలవు. అంతేకాని, ఒక్కసారిగా వాటిని తొలగించుకోవడం సాధ్యం కాదు.

ఎడతెగని ప్రయత్నం వల్లనే భగవద్ధ్యాన తత్పరమైన మనస్సును ఇతర ఆలోచనలు లేకుండా పరిశుద్ధంగా ఉంచవచ్చును."

ఈ గుర్వూపదేశాన్ని విని, ఆ శిష్యుడు ఎంతో సంతృప్తి చెందాడు.

---

ఇంత తొందరగా నిద్రపోయిందేమా అని అనుకున్నాడు. నెమ్మదిగా నేలమీద గొంతు కూర్చుని గోడకి చేరబడ్డాడు. లేపడమా, మానడమా అని సందేహిస్తూ పడుకున్న కూతురి వంక చూశాడు.

కూతుర్ని చూస్తూంటే రాములికి 'పెద్దింటి ఆడకూతుల్లు' జ్ఞాపకానికి వచ్చేరు. చక్కని చీరా జాకెట్టూ తొడిగి, తీరుగా జడవేసి, చేతికి బంగారం గాజులూ, మెడలో గొలుసూ, చెవులకి జూంకాలూ వేయిస్తే 'ఏ పెద్దింటి ఆడోల్లు నిలబడగల్రు నా సుక్కమ్మ ముంగల!' అనుకున్నాడు రాములు, అలాంటి కూతుర్ని కన్నానన్న గర్వంతో.

పాపం, దానికి వున్నది ఒకటే చీర. అదీ చరుగులు పడిన చీర. వీధిలోకి వచ్చినప్పుడు మాత్రమే దాన్ని కడ్తుంది. ఇంట్లో వున్నప్పుడు తండ్రి పంచెని ఒంటికి చుట్టుకుంటుంది. చిన్నప్పుడెప్పుడో ముక్కుపుడక కోసం ముక్కుకి కన్నం పెట్టించేరు, గాని ఏదో కారణంవల్ల పుడక వేయించలేకపోయాడు రాములు. ఆ కన్నం కాస్తా పూడుకుపోతుందేమోనన్న భయంతో రాగికాడతో కాలక్షేపం చేస్తూంది చుక్కమ్మ. చెవులకున్న కన్నాలకి కూడా అదే గతైంది.

"నాకు సొమ్ములూ సోకులూ ఏటీ వొద్దుగానీ, ఓరయ్యో, పవకముచ్చు కోకొకటి తెచ్చిపెట్టుమీ!" అని అడగలేక అడగలేక అడిగింది ఓ రోజున.

ఆనాటి వరకూ రాములికి చుక్కమ్మ వయస్సు గుర్తుకి రాలేదు. వేళ్లతో లెక్కబెట్టి ఏవేవో జ్ఞప్తికి తెచ్చుకుని — 'సుక్కగుంట'కి పద్దెనిమిదేళ్లు ఎప్పుడో వెళ్లిపోయేయుని గ్రహించేడు రాములు. కనబడని దెయ్యమేదో మీద పడి తనని పీక్కు తింటున్నట్టు గిలగిలలాడిపోయేడు.

"అలాగేలేయే" అని అప్పటికేదో సమాధానం చెప్పి ఆలోచనలో పడ్డాడు రాములు.

కొత్త కోక కొనాలంటే పది రూపాయలేనా అవుతుంది. దానికి డబ్బు ఎక్కణ్నుంచి వొస్తుంది? ఇంట్లో ఇంకా పాతికేళ్ల కొడుకున్నాడు. వాడు ఇంకా తనలా గవరయ్య బుగత దగ్గర కంబారితనం చెయ్యనన్నాడు. రోజు కూలీగా వ్యవసాయం పనుల్లో పని చేస్తాడు. లేనప్పుడు లేదు. ఇద్దరూ రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడితే వేళకి గంజినీళ్లకే గతిలేకుండా పోతూంది.

"దప్పిక కాసుకుని తాగనానికే టికానా నేదే, కోకలూ సొక్కాలూ వానెలా కొంతాను?" అని ఆ తర్వాత అస్పష్టంగా గొణుక్కుని, బుగత దగ్గరికి ఆశగా వెళ్లేడు.

ఆ రోజు రాములికింకా నిన్నా మొన్నటిదానిలా బాగా జ్ఞాపకం వుంది ... చుట్ట కాల్చుకుంటూ తీరుబడిగా కూర్చున్న బుగత దగ్గరికి వెళ్లేడు. చేతులు కట్టుకుని వినయంగా నిల్చున్నాడు.

"బావూ, బుగతగోరూ, సిన్న వుపకారం సెయ్యాల" అన్నాడు.

బుగత నోట్లోని చుట్టతీసి కాండ్రించి వుమ్మేడు. చిన్న దగ్గు దగ్గి నిశితంగా, ఎదురుగా నిలబడున్న రాముల్ని చూసేడు.

"ఒరే రాములూ! వూర్లొ అందరికీ వుపకారాలు సెయ్యనేక సస్తన్నాన్రా. నువ్వొక్కడివే బాకీ వుండిపోనావు. నీకు అయిదొందలిచ్చి పదేల్లయింది. దాని పాయిదా కింద కూలి గింజలు కోసుకుని ఇస్తంటే యిప్పటికే ఏడస్తన్నావు ... అది యాదస్తుంచుకొని మరీ అడుగు...!" అని హెచ్చరికలాంటిసమాధానం యిచ్చాడుగవరయ్యబుగత.

"డబ్బు కాదు, బావూ."

"మరేదిరా ?"

"తమరిడిసీసిన కోకేదైనుంటే అడుగుదావనొచ్చేను బావూ"

"ఓరి సన్నాసెదవా నేనిడిసీసిన కోకేట్రా ? నాను కోక కట్టుకుంటే నువ్వెప్పుడేని సూసినావురా ?" అని ఉరిమేడు బుగత

అప్పటిగ్గానీ తను చేసిన తప్పు గ్రహించలేదు రాములు

"నా తప్పు కాయి బావూ. బుగతమ్మగారి పాత కోకేదైనుంటే ఇయ్యి బావూ! సిరుగుల కోకతో ంయీధిలోకి రానేక సిగ్గుతో సచ్చిపోతన్నాది బావూ, మా అమ్మ!" అని దీనంగా బుగత కళ్లల్లోకి గాజు గుడ్లలాంటి కళ్లతో చూశాడు రాములు.

"నీకు అంత పెద్ద కూతురుందేట్రా రావులూ ?"

"అవును బావు. ఒచ్చీ సంక్రమణానికి దానికి పద్దెనిమ్మిది సమ్మచ్చరాలు ఒచ్చేస్తాయి బావు!"

"అలాగా" అన్నట్టు సాలోచనగా తల పంకించేడు గవరయ్య బుగత.

"అడగనానికి నాకింకెవరున్నారు బావు ? తల్లీ దండ్రీ అన్నీ మీరే. ఈడొచ్చిన పిల్లదాయి కట్టుకుందుకు కోక నేక సిగ్గుతో సస్తంది. అది సూడనేక నాను సస్తన్నాను. అందికి ఇనాగ పారొచ్చినాను బావు!" అని తన బాధని క్లుప్తంగా బుగతకి మనవి చేశాడు రాములు.

"అనాగేలేరా. సూస్తాన్లే. మల్లీ ఆదోరం మా అమ్మి ఇసాకపట్నంనుండొస్తాది. దానికాడున్న కోకైదైనా యిప్పిస్తాన్లే..." అని ఆ ప్రసక్తికి అంతటితో భరతవాక్యం పాడుతున్నట్టు బుగత లేచి నిలబడ్డాడు.

"చిత్తం బావు" అనేసి గొడ్ల పాకలోకి దూరేడు రాములు.

ఇప్పటికి అలాంటి ఆదివారాలు పదికి పైనే వచ్చేయి. వెళ్లేయి. పట్నం నుంచి ఆయన 'అమ్మి' గారూ వచ్చింది. కాని, రాములు కోరిన కోక సంగతి మాత్రం అలాగే వుండిపోయింది. ఎప్పటికప్పుడు ఎలాగైనా మళ్లీ బుగతకి జ్ఞాపకం చేద్దాం అనుకునేవాడు రాములు. కాని, అలా అనుకున్నప్పుడల్లా ఏదో ఒక అవాంతరం వచ్చి నెత్తిన పడేది... అప్పటికీ యిప్పటికీ చుక్కమ్మ కోక వ్యవహారం అరంగుళం ముందుకేనా జరగలేదు!

(ఇంకా వుంది)

# సినిమా



''ఎవరికి వారే యమునాతీరే''లో రోజారమణి

## రోజాకు రాజు తోడు !

''భగవంతుడా ! నీ లీలలు అనూహ్యములు. ఎందుకిలా చేస్తావని అడిగినంత మాత్రాన, నీవు మారగలవా? నా చాద స్తంగాని.'' అంటూ తన ఆవేదనను వెల్లడించింది రోజా.

దేవుడు ఆమెను అందాల బరిణెగా పుట్టించాడు. అందాన్ని చూచి ఆనందించే దృష్టిని లేకుండా చేశాడు. అంధురాలిని బీద కొంపలో పుట్టించాడు. దిన గండంగా బ్రతికే తన తల్లికి మందులు కొనడానికి బజారుకు బయల్దేరింది.

కళ్లు లేని ఆమె పుట్టించినవాడ్ని తిట్టుకొంటూ కొన్ని ప్రశ్నలు వేసింది.

''జాలి లేని బ్రహ్మయ్య
బదులు పలుకవేమయ్య
పాప మేమి చేశానో
కన్ను లీయ మరిచావు'' అంటూ ఆమె పాడు కుంటూ వీధులంట నడుస్తూవుంటే, దుండగులు కొందరు ఆమెను వెంబడించి, హింసించ ప్రయత్నించారు. ఆ భీకర దృశ్యాన్ని అల్లంత దూరం నుండి చూచిన రాజబాబు ఆ దుర్మార్గుల మద మణచి, రోజాను రక్షించాడు. ఆమె అతడికి వేయి దండాలు పెట్టింది. ఆమె శోక కథనువిని రాజబాబు కన్నీరు కార్చాడు. 'నే వున్నానులే. దిగులు పడకు' అని ఆమెను ఓదార్చాడు. ఈ హృద్యమైన ఘట్టం ''ఎవరికి వారే యమునాతీరే'' చిత్రంలో కనిపిస్తుంది. ఈ చిత్రానికి దాసరి దర్శకుడై యుండ, వ్యాపారం గూర్చి దిగులు పడనేల? దిడ్డి కుమార్ నిర్మిస్తున్న యీ చిత్రం రాజబాబు పుట్టినరోజున విడుదలవుతుంది.

''హవస్‌లో'' నీతూసింగ్



## ఎన్టీఆర్ దీక్ష !

ఆస్తిని అపహరించిన వ్యక్తిని, తండ్రిని చంపిన కిరాతకుడ్ని పట్టి, తుద ముట్టించడానికి ఎన్టీఆర్ దీక్ష బూనాడు.

విధి చాలా విచిత్రమైనది. ఎవరయితే తన తల్లి నుదుట కుంకుమ లేకపోవడానికి కారణ మయ్యాడో, అతడి కుమార్తె తనను మనసారా ప్రేమించి, మూడుముళ్ల కోసం ఆరాటపడింది. ధనవంతుడి కూతురంటే అసహ్యించుకుంటాడని ఎంచి, పూలపిల్లగా నటించి అతగాడి గుండెలో చోటు చేసుకుంది.

ప్రేమించిన యువతికోసం తన దీక్షను ఉప సంహరించుకొన్నాడా లేక తన శపథం నెరవేర్చు కొన్నాడా అన్న దానికి సమాధానం పద్మజా మూవీస్ వారి ''దీక్ష'' చిత్రం చెప్పాల్సిందే. ఈ చిత్రంలో రామారావు నటన జనాకర్షణీయంగా, ప్రేక్షకుల కరతాళ ధ్వనులు అందుకునే విధంగా వున్నది. ఇందులో జమున, రాజబాబు, అంజలీదేవి, ప్రభాకరరెడ్డి, కె. విజయ, అపర్ణ ముఖ్య తారాగణం. కథను ఆర్. కె. ధర్మరాజు యిచ్చారు. ప్రత్యగాత్మ మాటలలో ప్రత్యేకత వున్నది. పెండ్యాల సంగీతంలో మధురిమ వున్నది. దీక్ష నొక వ్యాపార చిత్రం అనడం వుచితం. పదేండ్ల తరువాత ప్రత్యగాత్మ — రామారావు కాంబినేషన్‌లో వస్తున్న చిత్రం యిది. నిర్మాతలు : కుటుంబరావు; సుబ్బారావు.

## జన్మ జన్మల బంధం

లేఖలను అందించే పోస్ట్‌మెన్, పాఠాలు నేర్పే పంతులమ్మ గాఢంగా ప్రేమించుకొన్నారు. ఇద్దరి మనసులు ఏకమయ్యాయి. ప్రేమ సామ్రాజ్యానికి రాజా, రాణి అయ్యారు. ఆమె మెడలో అతడు మూడు ముళ్లు వేశాడు. ఇద్దరూ ఏడడుగులు జంటగా నడిచారు.

అన్యోన్యానురాగ బద్ధులై జీవితాన్ని సాగిస్తున్న వారితో దేవుడు ఆడుకొన్నాడు. ఒక ప్రమాదంలో ఆమెకు పలుకు పోగొట్టి మూగదాన్ని చేశాడు.

ఆమె కుమిలి కుమిలి ఏడ్చింది. అతడు ఎంత ఓదార్చినా వినదాయె. ఆమెను తన వొడిలోకి తీసుకుని ఏడవకు, ఏడవకు, నా బుజ్జి ప్రియతమా



''కథానాయకుని కథ''లో రామారావు, వాణిశ్రీ

అంటూ నవ్వించడానికి ప్రయత్నించాడు. అయినా ఆమె నవ్వదాయె.

''నోరు లేదని కన్నీరెందుకు
పలుకలేవని కలతచెందకు
నీ పెదవిపైని చిరునవ్వే పాటగా
నా బ్రతుకంతా నీకోసం పాడనా'' అంటూ

ఆమె కన్నీటిని తుడిచి, ముద్దుగా లాలించాడు. ''కట్'' అన్నారు దర్శకుడు తాతినేని రామారావు. ఈ ఘట్టం ''దేవుడు చేసిన పెళ్లి'' చిత్రంలో కనిపిస్తుంది. పోస్ట్‌మెన్‌గా శోభన్‌బాబు, మూగ ఎల్లిగా శారద నటించారు. ఈ చిత్రాన్ని ఏ. పూర్ణ చంద్రరావు వర్ణ చిత్రంగా నిర్మిస్తున్నారు. పంతులమ్మకు జరిగిన ప్రమాదం, పర్యవసానంగా మూగ అయిన వైనం ఈ కథలోని జీవరహస్యం అన్నారు కథకుడు గొల్లపూడి. ఈ చిత్రానికి సత్యానంద్ మాటలను, చలపతిరావు సంగీతాన్ని, కన్నప్ప ఛాయను, జి. వి. సుబ్బారావు కళను చేసేట్టారు. ముఖ్య పాత్రలను నాగభూషణం, కాంతారావు, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, గిరిబాబు, కాకరాల, లక్ష్మి, విజయ, చంద్ర మోహన్ పోషిస్తున్నారు. లక్ష్మీ ఫిలింస్ విడుదల.

## జమున ద్విపాత్రాభినయం

పత్రికా రచయితగా వుండి ''వనజ — గిరిజ'' చిత్రానికి దర్శకుడయిన గౌతమ్‌కి ఇ. కుప్పస్వామి లాంటి నిర్మాత దొరకడం ఎంత పెద్ద అదృష్టమో! ఈ చిత్రంలో వనజగా జమున, గిరిజగా జమున వైవిధ్యమున్న రెండు పాత్రలను పోషించ, సహాయ భూమికలను కృష్ణకుమారి, విజయలలిత, భవానీ, సురభి బాల సరస్వతి, లక్ష్మీకాంతం, రామకృష్ణ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్, రావు గోపాలరావు, పద్మనాభం ధరిస్తున్నారు. ఈ చిత్రానికి అశోక్‌కుమార్ ఛాయను, చలపతిరావు సంగీతాన్ని, దిలీప్‌సింగ్ కళను, పి. వి. కృష్ణమూర్తి సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

కథ బాగా వుండడంవల్ల, నటీనటులు బాగా సహకరించడంవల్ల, నిర్మాత మంచివాడు అవడం వల్ల, దర్శక భారాన్ని మోస్తున్న గౌతమ్‌కి పని సులువుగా జరుగుతూ వుంది. చేపట్టిన పనిలో ప్రతిభను ప్రదర్శించి ప్రజల దీవెనలకు పాత్ర మవ్వాలి అని ఆశిస్తున్నాను

## గ్లామర్ తార మంజుల!

ఒకప్పుడు గ్లామర్ క్వీన్ అంటే జయలలిత పేరు వినవచ్చేది. ఇప్పుడా పేరు మంజులకు సంక్రమించింది. ఇప్పుడున్న మన తారామణులలో మంజులకు వున్న గ్లామర్ మరెవ్వరికీ లేదు అనడానికి నేను సంశయించడం లేదు. (అగ్రగామి వాణిశ్రీ తప్ప).

జగపతి పిక్చర్స్ వారి ''మంచి మనుషులు'' వర్ణ చిత్రం విడుదలయితే, మంజులను పట్టుకోవడం చాలా కష్టం. కేవలం గ్లామర్ మాత్రమేగాక, గొప్పగా నటించగల ప్రతిభ మంజుల కున్నదన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. ఈ చిత్రంలో మంజుల అందానికి, అభినయానికి మొదటి మార్కులు యివ్వక తప్పదు. ఇందులో శోభన్‌బాబు, జగ్గయ్య, నాగభూషణం, రాజబాబు, అంజలీదేవి, మాస్టర్ టిట్టో ముఖ్య పాత్రధారులు. మంచి మనిషి రాజేంద్ర ప్రసాద్ నిర్మించిన ''మంచి మనుషులు'' ప్రేక్షకుల మనసుకు పూవును, పుల్పాహోన్ని ఏర్పరస్తుంది. వెంకటరత్నంతో మహదేవన్ పోటీపడ్డారా లేక మహదేవన్‌తో సుశీల బాలసుబ్రమణ్యం పోటీపడ్డారా అన్న విషయాన్ని ప్రజలు తేల్చాల్సిందే.

ప్రేక్షకులు ఆశించే అన్ని అంశాలు వున్న చిత్రంగా ''మంచి మనుషులు'' తయారైంది. ముఖ్యంగా మంజులకు హీరోయిన్ పాత్ర ఎంత మహర్దశకు దారి తీస్తుందో, ముమ్ముందు తెలుస్తుంది. ఇచ్చే పాత్రను బట్టి, చేయించుకునే దర్శకుడ్ని బట్టి నటీనటుల సామర్థ్యం బహిర్గత మవుతుంది. మంజుల నటన నా వాదానికి నిదర్శనం.

## జమిందారుగారి అమ్మాయి

నవత చిత్ర నిర్మిస్తున్న చిత్రానికి యీ పేరు పెట్టినట్టు నిర్మాత ఎన్. కృష్ణంరాజు చెప్పారు. టైటిల్ పాత్రను శారద పోషిస్తున్నది. జమిందారు కుమార్తెగా పుట్టి, భోగ భాగ్యాలలో పెరిగి, పరిస్థితుల ప్రభావం వల్ల అదే భవంతిలో పనిమనిషిగా వూడిగం చేసిన ఒక స్త్రీమూర్తి జీవిత కథ యిది. బాగా బతికిన జమిందారుగా, చితికిన జమిందారుగా గుమ్మడి నటిస్తున్నారు. (చాలా మంచి వేషం. ఇంతవరకు వెయ్యని వేషం).



''రాజ్యంలో రాబందులు''లో విజయలలిత, రామకృష్ణ

పై చిత్రానికి డి. వి. నరసరాజు రచనను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, సుకదేవ్ ఛాయను, కళాధర్ కళను నిర్వహిస్తున్నారు. 'దిక్కుట్ల పార్వతి' ఫేమ్ శింగీతం శ్రీనివాసరావు యీ చిత్రానికి దర్శకుడు.

ఊర్వశి బిరుదును రెండు సార్లు అందుకొన్న శారద ప్రక్కన రంగనాథ్ ఏం సరిపోతాడు అని వాపోయిన వ్యక్తులు అతడు ఎంత చక్కగా వున్నాడు అనే రోజులు దగ్గర్లోనే వున్నాయి. పెద్దలు చూచి రంగనాథ్‌కి మంచి మార్కు లిచ్చారు. ఈ చిత్రంలోని సహాయ పాత్రలను రాజబాబు, అల్లు రామలింగయ్య, రావి కొండలరావు, సారథి, కృష్ణకుమారి, మమత పోషిస్తున్నారు. అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదలయ్యే యీ చిత్రానికి డి. ఎస్. ఆర్. రాజు, విజయరామరాజు సహ నిర్మాతలు.

## ప్రకాశరావు చిత్రంలో రామారావు

అనిల్ ఆర్ట్స్ స్థాపించి మూడు వత్సరాలు అయింది. మొదటి చిత్రం ''మైనరు బాబు'' లో శోభన్, రెండవ చిత్రం ''గాలిపటాలు'' లో కృష్ణ, యిప్పుడు తలపెట్టిన తృతీయ చిత్రంలో నటరత్న హీరో. ఈ చిత్రానికి కథ, సినిమా



''జమిందారుగారి అమ్మాయి''లో రంగనాథ్, శారద

# సినిమా

అనువాదం, దర్శకత్వంను తాతినేని ప్రకాశరావు చేపట్టారు.

అక్టోబరు 4 న షూటింగు ఆరంభం. ''కృష్ణాంజనేయ యుద్ధం, దేవుడు చేసిన మనుషులు'' తర్వాత ఎన్టీఆర్ చిత్రానికి తారకరామ, నవభారత్ పంపిణీదారులు గావడం యిప్పుడే. ఈ చిత్రానికి భమిడిపాటి మాటలను, చలపతిరావు సంగీతాన్ని, తోట కళను, పాణి సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. ''కెమెరా కింగ్'' ఎస్. వెంకటరత్నం ఛాయను చేపట్టడం ఈ చిత్రానికి ప్రత్యేకత. రామారావుతో కలిసి పనిచేసే మొదటి చిత్రం యిదేనేమో.

ఈ చిత్రంలో రామారావుతోబాటు జమున, రోజారమణి, జయసుధ, గుమ్మడి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, చిట్టిబాబు, మాడా ప్రధాన భూమికలను ధరిస్తున్నారు.

ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మితమయ్యే ఈ చిత్రానికి టి. ఎల్. వి. ప్రసాద్ నిర్వాహకుడు. ప్రొడక్షన్సు కృష్ణమూర్తి, అజీజ్ నిర్వహిస్తున్నారు.

## ఆడదాని అదృష్టం

విఠలాచార్య నిర్మిస్తున్న చిత్రం పేరు యిది. పుట్టినింటి నుంచి మెట్టినింటికి వచ్చే ఆడదానిపై యింటికి మంచిగాని, చెడుగాని జరుగుతుంది అనెడి అంశంపై అల్లబడిన ఈ కథకు రాజశ్రీ మాటలను రాశారు.

కొంతకాలం అజ్ఞాతవాసం చేసిన జి. వి. ఆర్. శేషగిరిరావుకు పునర్జన్మను ఆచార్య ప్రసాదించాడు. కాపాడుకునే బాధ్యత జి. వి. ఆర్. పై వుంది. ప్రేక్షకులకు నచ్చే కథనే జి. వి. ఆర్. కి యివ్వడం జరిగింది. ఈ చిత్రానికి హనుమంతరావు సంగీతాన్ని, సత్యనారాయణ ఛాయాగ్రహణాన్ని చేపట్టారు.

ఆగష్టు 19 నుండి ఏకధాటిగా నెలరోజులు షూటింగు జరిగిన ప్రతిఫలంగా పదిరీళ్లు తయారైనట్టు తెలిసింది. ఈ చిత్రంలో చలం, రామకృష్ణ, మిక్కిలినేని, సాక్షిరంగారావు, నిర్మల, వై. వి. రాజు, కేశవరావు ముఖ్య పాత్రధారులు. విజయా పిక్చర్స్ విడుదల.

మమతకు మంచి వేషం యివ్వబడింది. సుమకు భలే ఛాన్సు తగిలింది. చిట్టిబాబుకు ముఖ్య హాస్య నటుడి పాత్ర లభించింది. గిరిజకు గ్రేడు పెరిగే వేషం దొరికింది. వీళ్లందరూ బాగా చెయ్యగలిగినవాడు, పరిశ్రమలో, ప్రజలలో విశేష గౌరవాన్ని అందుకోగలరు.

విఠలాచార్యకు వీరందరూ ఋణపడి యుండాలి.

## గయ్యాళి కృష్ణ !

ఈ మధ్య సురేష్ మూవీస్‌వారి ''చక్రవాకం'' వర్ణ చిత్రం చూశాను. ఇందులో శోభన్‌బాబు, ఎస్వీ రంగారావు, నాగభూషణం, పద్మనాభం, రాజబాబు, అల్లు రామలింగయ్య, వాణిశ్రీ, చంద్రకళ, అంజలీదేవి, జి. వరలక్ష్మి, రాజసులోచన, రామానాయుడు ఎవరిమటుకు వారు గొప్పగా నటించారు. సాంకేతిక శాఖలను ఆత్రేయ, మహదేవన్, మార్కస్ బార్ట్లే, మార్తాండ్ లాంటి వుద్దండులు నిర్వహించారు. విక్టరీ మధుసూదనరావు దర్శకుడు గావడం చేత గజిబిజి వుండే ఆస్కారం లేదు.

''చక్రవాకం''లో నన్ను ఆకర్షించిన పాత్ర కృష్ణ ధరించిన గయ్యాళి పాత్ర. ఆమె యిలాంటి పాత్రలను కూడా ప్రతిభావంతంగా పోషించగలదా అని ఆశ్చర్య పరిచింది. మొన్న మొన్నటివరకు కరుణ రస ప్రధానమైన పాత్రలను పోషించి మెప్పించిన కృష్ణ గయ్యాళిగా కూడా ఘనంగా చెయ్యగలదా అనిపించింది. తరవాత కొంతసేపటికి ''ఇలవేల్పు'' గుర్తుకొచ్చింది. అందులో రేలంగి భార్యగా కృష్ణ యిదే మనస్తత్వం గొన్న పాత్రను ధరించి యున్నది.

ఇకపై హీరోయిన్ వేషం ఎవరూ అడగరన్న నిజం కృష్ణకుమారికి తెలుసు. మంచి ఆర్టిస్టు అని అందరూ అంటారు. వేషం చిన్నదని ఎంచి, వచ్చేవాటిని వదులుకోవద్దని, క్యారెక్టర్ ఆర్టిస్టుగా ఋజువు చేసుకోమన్న చెప్పే నా సలహాను పాటించగలదా ?



''చక్రవాకం''లో వాణిశ్రీ

## అగ్రనటి ధరించే పాత్రలు

''చక్రవాకం'' లో అద్వితీయంగా నటించిన వాణిశ్రీని, ''కృష్ణవేణి'' లో అత్యద్భుతంగా నటించిన వాణిశ్రీని ఎక్కువ చిత్రాలలో చూడలేక పోతున్నామే అన్న బాధ ప్రేక్షకులలో వినిపిస్తున్నది. వాళ్ల అభిమానానికి పాత్రమయ్యే వేషాలను మాత్రమే చెయ్యాలి అని గట్టి నిర్ణయాన్ని తీసుకోవడం మూలంగా వచ్చే ప్రతి చిత్రాన్ని అంగీకరించలేక పోతుంది. అలా వొప్పుకోవడమే జరిగితే, ప్రతి నిర్మాత అగ్ర నటిని పెట్టి సినిమా తీయడానికి ఉత్సాహపడతాడు.

ఇప్పుడు ఆమె నటిస్తున్న చిత్రాలన్నీ విజయాన్ని చవిచూచే కథలుగా వున్నాయి. అపజయం ఎరుగని తారగా అగ్ర నటి మరొక దశాబ్దం పాలించగలదు.

తారకరామ పిక్చర్స్ వారి ''కథానాయకుని కథ'' చిత్రంలో రామారావు, డూండేశ్వరరావు చిత్రంలో కృష్ణ, మారుతీ ప్రొడక్షన్స్‌లో శోభన్‌బాబు, రంజిత్ మూవీస్‌లో కృష్ణ, రాజేశ్వరీ ఎంటర్ ప్రైసెస్‌లో రామారావు, సురేష్ మూవీస్‌లో శోభన్‌బాబు ఈమెకు జతగాళ్లుగా నటిస్తున్నారు. ప్రతి చిత్రంలో ఈమె పాత్రలో ప్రత్యేకత వున్నదన్న నిజాన్ని ప్రేక్షకులు పసిగట్టగలరు. ఈమెకు ప్రజలలో వున్న బలం ఇప్పట్లో తగ్గేదికాదు అనే నా వాదంతో అధిక శాతం ఏకీభవించగలరని నమ్ముతున్నాను.

—శ్రీనివాస్



''దీక్ష''లో రామారావు

# మీ ప్రత్తి దిగుబడిని 20% దాకా అధికం చేసుకోండి

# మొక్కల హార్మోన్ ఎసిమోన్ వాడండి




అంటే మీకు ఎక్కువ కాయలు వస్తాయన్న మాట. ప్రత్తి యేకు రిమాణ కూడా బాగా పెరుగుతుంది. ఫలితంగా మీరు అధిక దిగుబడిని సాధిస్తారు

**ఎసిమోన్ అంటే ఏమిటి?**

ఎసిమోన్ సహజంగా మొక్క పెరుగుదల రేటును, స్వభావాన్ని అదుపులో ఉంచే సహాయక పదార్థాల ద్వారాలుగ సింథెటిక్ మిశ్రమము దీనిని సారి మొక్కలపై చల్లితే మొక్కలు భూమిలో నుండి పోషక పదార్థాలను అత్యధికంగా గ్రహించేటట్లు చేస్తుంది

**మీరు అనుకుంటున్న దానికంటె ఆదా అయినది**

ఎకరానికి ఒకే ఒక ఎసిమోన్ సీసా చాలు ఇది కీటక నాశనులు, ఎరువులకు అనుగుణ్యమైనదే గనుక శ్రమ ఖర్చు కూడా బాగా ఆదా అవుతుంది

ఎసిమోన్‌ను పొగాకు మిరప మామిడి అనాస, ఆపిల్ ఎయర్స్ బంగాళాదుంప గులాబీ రబ్బరు, గోధుమ, వరి, జొన్న చెరకు మరియు ఎన్నో ఇతర పైర్లపై కూడా వాడవచ్చును



# దేవిదయాల్ ఎగ్రో కెమికల్స్

దేవిదయాల్ (సేల్స్) ప్రైవేట్ లిమిటెడ్ వారి విభాగము
గుప్తా మిల్స్ ఎస్టేట్ రే రోడ్ బొంబాయి 400 010

మీ ప్రత్తి పైరుపై ఎసిమోన్ చల్లి, జరిగే మార్పును మీ అంతట మీరే చూడండి
సామాన్యంగా రెండు మూడు పూవులు వేసే కొమ్మపై 5 లేక అంతకన్న ఎక్కువ పూవులు పూయడం జరుగుతుంది—పూవులు రాలి పోవడం కూడా చాలా వరకు తగిపోతుంది

**తెగుళ్ళ వినాశనులు లభించే అన్ని షాపులలోనూ సులభంగా దొరుకుతుంది**


ప్రాంతీయ కార్యాలయం మె దేవిదయాల్(సేల్స్) ప్రై లి. క్వమార్ మాన్షన్ 5—9—164 చాపల్‌రోడ్ ... హైదరాబాద్—500001
బ్రాంచి కార్యాలయం మె దేవిదయాల్ (సేల్స్) ప్రై లి 27—10—32 ... గవర్నరుపేట విజయవాడ—520002
డీలర్లు 1 ... (ఎ) ... గుంటూరుజిల్లా పోన్ 25 (బి) 26—1—90 ... రోడ్ ... 2 ... ఎగ్రో కెమికల్స్, మెయిన్‌రోడ్ కాకినాడ. 3 ... తాడేపల్లిగూడెం పశ్చిమ గోదావరి 4 ... & కో మహబూబ్‌నగర్ 5 ... & సన్స్ నల్గొండ. 6 ... & కో గాంధీ రోడ్ ... 7 ... & కో ... హైదరాబాద్ 8 ... ఎగ్రో ...

# మళ్ళీ కథ మొదటికి...



కొనకళ్ళ
తేజస్ కుమారి

"అబ్బబ్బ! ఆ గావు కేకలు వినలేకుండా వున్నాం ఆ రేడియో కొంచెం కడతావా?" గట్టిగా అరిచాడు చిట్టిబాబు

"ఓహో! మీ రఫీగారి పాటలయితే సొంపుగా వుంటాయి 'కాబోలు వినడానికి!' మాటలు రాని పిల్లాడిలా — ఆ బెక్కటం అవీని "

"షటప్! రఫీ పాటలని విమర్శించే జ్ఞానం వుందా నీకు? నోరు మూసుకొని ముందా రేడియో ఆఫ్‌చేయి!" గర్జించాడు చిట్టిబాబు అచ్చం మొగుళ్లాగ విసురుగా రేడియో ఆఫ్‌చేసి - విసవిసా వంటింట్లోకి వెళ్ళిపోయింది సుబ్బలక్ష్మి ఉక్రోషంగా—అచ్చం పెళ్లాం లాగా

తీరిగ్గా సిగరెట్ పొగలు వదులుతూ పేపరు చదువుకుంటున్న చిట్టిబాబు — టీపాయ్ మీది ప్లేట్ల చప్పుడు విని తల పైకెత్తాడు రుసరుసలాడే ముఖంతో కసిగా తనని చూస్తున్న సుబ్బలక్ష్మిని ఒక్కసారి చూసి — సిగరెట్ ముక్కని యాష్‌ట్రేలో కుక్కుతూ ప్లేటందుకున్నాడు చిట్టిబాబు

"మీ కిష్టంలేని పనులు నేను చేయకూడదు కాని, నా కిష్టంలేని పనులు మాత్రం మీరు చేయొచ్చన్న మాట! పెళ్ళయినప్పటి నుంచి చెబుతున్నా ఆ సిగరెట్లు కాల్చకండీ— నా కసహ్యం అని! మానగల్గుతున్నారా? మానరు ఎందుకు మానాలి? మీరు మగ మహారాజులు!" నిష్ఠూరంగా దెప్పిపొడిచిన సుబ్బలక్ష్మిని ఆప్యాయంగా దగ్గరకి తీసుకుంటూ —

"సారీ సుబ్బులూ! సిగరెట్ అంటే నాకు చచ్చేటంత యిదోయ్ మానలేకపోతున్నా! "ఏదో చెప్పబోయాడు చిట్టిబాబు

"ఓహో! మరి అలాగే అందరి అభిరుచులూ అనుకోరాదా! 'ఆ కిషోర్‌కుమార్ పాటలు వినకు — ఆ మల్లెపూలు పెట్టుకోకు — చామంతులే పెట్టుకో" అంటూ అధికారం వెలగబెట్టటం ఎందుకు?' సాగదీసింది సుబ్బలక్ష్మి విదిలించుకుంటూ

ఆ విదిలింపుతో చిర్రెత్తిన చిట్టిబాబు —

"నేనేదో తగలడతా! నాయిష్టం! నువ్వనవసరంగా ఆర్గ్యూ చేయకు!" సీరియస్‌గా అంటూ ప్లేటు టీపాయ్ మీదకి విసిరాడు!

అంతకంటే సీరియస్‌గా — ప్లేటు అందుకొని — వంటింట్లోకి వెళ్లిపోయింది సుబ్బలక్ష్మి విసురుగా

*　　*　　*

సుబ్బలక్ష్మి—చిట్టిబాబు — సంసార జీవితంలో ఒక్క సంవత్సరం మాత్రమే అనుభవం పుచ్చుకున్న సహచరులు చిట్టిబాబు కాలేజీలో జూనియర్ లెక్చరర్‌గా పని చేస్తున్నాడు పెళ్లయినప్పటికే ఉద్యోగం చేస్తున్న చిట్టిబాబు — సుబ్బలక్ష్మితో కొత్తకాపురం పెట్టాడు తాను వర్క్ చేస్తున్న తాడేపల్లి గూడెంలోనే ముచ్చటయిన జంట అని అంతా మురిసిపోయారు అందచందాలలో ఒకరి కొకరు పోటీపడేలా వుండేవారు కాని వచ్చిన చిక్కల్లా ఒక్కటే—వారి అభిప్రాయాలు అభిరుచులు వేరవ్వటం

చిట్టిబాబు రఫీ పాటలంటే పడిచస్తాడు లక్ష్మికి కిషోర్ పాటలంటేనే యిష్టం తెలుగు సినిమాలని అసహ్యించుకొని — హిందీ సినిమాలు మాత్రమే చూసే అలవాటు సుబ్బలక్ష్మిది అయితే— తెలుగు సినిమాలంటే ఎక్కడలేని అభిమానాన్ని ఒలకబోస్తాడు చిట్టిబాబు చైన్‌స్మోకర్ చిట్టిబాబు అయ్యివుండగా — అసలు సిగరెట్ వాసనకే వాంతి చేసుకొంటాది — సదరు సుబ్బలక్ష్మి మల్లెపూలే పెట్టుకొంటాది సుబ్బలక్ష్మి కానీ పెద్ద పెద్ద పచ్చని చామంతులే యిష్టపడతాడు చిట్టిబాబు

ఇలానే ఎన్నో విషయాలలో — వారి అభిరుచులు వేరయ్యిపోవడంతో — సుఖ సంతోషాలతో వున్న కొత్తకాపురం మాత్రం - భారంగా నడుస్తుంది— టీ కప్పులలో తుఫాన్‌లతో!

కాలేజీకి వెళ్లాడేగాని చిట్టిబాబు మనసు మనసులో లేదు

"పిచ్చి సుబ్బులుకి — ఎంత ఉక్రోషమో! యివ్వాళ అనవసరంగా చిరాకుపడ్డాడు పాపం ఎంత బాధపడిందో! కోపంతో భోజనం చేసిందో లేదో " ఆలోచనలతో సిగరెట్ మీద సిగరెట్ కాల్చాడు పరాకుగా కాని తను అప్పటికీ సుబ్బలక్ష్మికి యిష్టంలేని పనే చేస్తున్న ఆలోచనే రాలేదు చిట్టిబాబుకి అంతవరకూ ఆ ఆలోచన

రావడమే తడవుగా — సిగరెట్ నేలకిపెట్టి కొట్టాడు విరాకుగా మొహంపెట్టి ఆ రోజంతా అలానే నిరుత్సాహంగా గడిచిపోయింది చిట్టిబాబుకి కానీ కాలేజీ అవ్వగనే హుషారుగా లేచాడు చిట్టిబాబు "ఏదయినా సినిమాకి తీసుకుపోవాలి సుబ్బుల్ని ఈ రోజు సంఘటన పూర్తిగా మరిచిపోవాలి సుబ్బులు! మళ్లా రేపటి నుంచి — ఒకరి మనము ఒకరు అర్ధం చేసుకొని గొడవలు లేకుండా నడుచుకోవాలి!" ఆలోచనలతోనే స్కూటరు స్టార్టు చేశాడు చిట్టిబాబు

పచ్చని చామంతులు చూడ ముచ్చటగా వున్నాయ్ తాడేపల్లిగూడెం సెంటర్‌కే అందం వచ్చింది ఆ పువ్వులవల్ల స్కూటరు ఆపి ఓ యాభై కొని పొట్లం కట్టించాడు చిట్టిబాబు పచ్చని చామంతులంటే చిట్టిబాబుకి చచ్చేటంత యిష్టం అందుకే వాటిని కొన్నాడు తప్ప, సుబ్బలక్ష్మికి యిష్టంకాదే మళ్లా గొడవ రేగుతుందేమో అని ఊహించలేకపోయాడు చిట్టిబాబు ఆ దారినే ప్రభాత్ టాకీస్‌కి వెళ్లి ఓ రెండు టిక్కెట్లు రిజర్వు చేయించి మరీ బయలుదేరాడు యింటికి స్కూటరు ఆపి హడావిడిగా యింట్లో అడుగు పెట్టిన చిట్టిబాబు – సుబ్బలక్ష్మి వాలకం చూసి— నీలుగారిపోయాడు నీరసంగా — నిరుత్సాహంగా — వాడిపోయిన ముఖంతో — మంచంమీద వాలిపోయి వున్న సుబ్బలక్ష్మిని చూసి — దగ్గరకు వెళ్లాడు చిట్టిబాబు సుబ్బులు అలా వుండటానికి కారణం— ఉదయం తగవులాట ప్రభావమే అని గ్రహించిన చిట్టిబాబు ఆప్యాయంగా ఆమె దగ్గరకు చేరి —

"ఏమేవ్ సుబ్బులూ! లేవ్వోయ్! మంచి పనుంది" అంటూ తట్టి లేపాడు ఆయాసపడుతూ

"ఏమిటో అంత పని?" వెటకారంగా అంటూ లేచి కూర్చున్న భార్యారత్నం తలలో చామంతుల్ని తురుముతూ —

"పిక్చరుకి పోదాం పదవోయ్! టిక్కెట్లు కూడా తెచ్చేసా! నువ్వింకా మూస్తాబులో వుంటావనుకున్నా! యిలా వున్నావేమిటి? లే! త్వరగా తెములు! సుబ్బులూ! నన్ను క్షమించవే! నిన్ను బాధపెట్టా ఉదయం! అందుకే యీ రాత్రి పిక్చరుకి పోదాం! రేపటి నుంచి హాయిగా తగవులు లేకుండా కాపురం చేసుకుందాం ఊ! లే—త్వరగా! క్విక్" ఖంగారు ఎక్కేస్తున్న చిట్టిబాబుని ఓ క్షణం చూసి —

"ఏం సినిమా ఏమిటి?" తాపీగానే అడిగింది సుబ్బులు

"శారద!" అబ్బ ఏం రష్ అని! ఎంత పెద్ద క్యూ! సుబ్బులూ! అడ్వాన్స్ బుకింగ్‌కి కూడా పెద్ద క్యూలేనే! ఇంకా ఏదో చెబుతూనే వున్నాడు చిట్టిబాబు

ఛీత్కారంతో ఒక్కసారి అతన్ని చూసి — మంచం మీద వాలిపోయి — మరో ప్రక్కకు తిరిగి పడుకుండిపోయిన భార్యారత్నం భావం ఏమిటో అర్ధం కాక అయోమయ పరిస్థితిలో పడ్డ చిట్టిబాబు

"ఏం సుబ్బులూ? బయలుదేరమంటే అలా పడుకుండిపోయావ్?" అమాయకంగా ప్రశ్నించాడు నెమ్మదిగా

"నేను రాను మీరు వెళ్ళండి" కోపంగా — విసుగ్గా అన్న సుబ్బులు మాటలకి

"ఏం? ఎందుకు రావు?" కొంచెం చిరాగ్గానే ఎదురు ప్రశ్న వేశాడు చిట్టిబాబు

"ఎందుకు రావు? అని అడుగుతున్నారా? అసలు నన్ను సినిమాకి తీసుకెళ్ళాలన్న ఉద్దేశం మీకుందా? ఉంటే — 'బాబీ' లాంటి మంచి హిందీ సినిమా ఊళ్లో ఆడుతుంటే — హిందీ సినిమాలంటే నా కిష్టం అని తెలిసి కూడా, తెలుగు సినిమాకి తెస్తారా టిక్కెట్లు? నేను రాను పొండి! కసిగా అంటూ — తలలో చామంతుల్ని తీసి — టేబుల్ పైకి విసిరికొట్టింది కోపంతో

జాలిగా చామంతుల్ని చూస్తూ వుండి

## షంఖర్ పాళి

ఈ పిండివంట మహారాష్ట్ర వంటకం మహారాష్ట్రీయులు వాళ్ల ఎక్కువగా చేస్తారు దీపావళికి తొమ్మిది రకాల పిండివంటలు చేస్తారు అందులో ఇది ముఖ్యమైనది కావలసిన పదార్థములు ఒక శేరు తాజా గోధుమపిండి పావుసేరు మెత్తని చక్కెర అర్ధపావు వెన్న

ముందు చక్కెర కొద్దిగ నీటిలో పోసి పొయ్యిమీద పెట్టవలెను చక్కెర కరిగిన తర్వాత గోధుమపిండిలో పోసుకుంటూ కలపాలి దానిలోనే కొద్దిగా వెన్నకూడా వేసి కలపాలి ఈ ముద్ద పూరీలపిండి కంటే గట్టిగా ఉండాలి ఎందుచేత నంటే పంచదార కరిగి పల్చబడుతుంది 5 గంటల తర్వాత పీటలమీద నారింజకాయంత ఉండలు చేసికొని పల్చగా ఒత్తుకోవాలి మందంగా అయితే బాగా పొంగవు కనుక పల్చగాన వత్తాలి వత్తిన పిదప చుట్టూ పిండి మందంగా వుండును కనుక దాని చుట్టూ చాకుతో కోసుకోవాలి

తర్వాత మధ్యన పూరీ చాకుతో డైమండ్స్ ఆకారములో కోసి నేతిలో దోరగా వేయించవలెను ఇవి పది పదిహేను రోజులు నిలవ వుంటాయి పిల్లలు తిన్నా జబ్బు చేయవు

— చిత్రపు లక్ష్మి

పోయాడు చిట్టిబాబు మళ్లా అందుకుంది సుబ్బలక్ష్మి

"నాకు మల్లెలంటే యిష్టం అని తెలిసి కూడా చామంతి పువ్వులే తెస్తారు మీకు నచ్చే రంగులే వాడాలి నా కిష్టం లేకపోయినా మీకు నచ్చిన నవలలే చదవాలి! అసలు ఏ విషయంలో నా యిష్టం చెల్లనిస్తున్నారు? అసలేమిటి మీ ఉద్దేశం? నా కిష్టంలేని పనులు నాతో చేయించటానికి ఎందుకిలా పంతం పడుతున్నారు? నేనిలా ప్రబతకటం మీ కిష్టంలేదా?"

ఎదురు ప్రశ్న వేసింది సీరియస్‌గా!

చిర్రెత్తిపోయింది చిట్టిబాబుకి

"ఛీ వెధవకొంప! సుఖమా? శాంతా?" ఛీదరించుకుంటూ — సినిమా టిక్కెట్లని వాళ్ళు ముక్కలుచేసి — విసిరేసి — చరచరా వెళ్లిపోయాడు బయటకు

మూతి ముడుచుకుని — మంచంమీద వాలిపోయింది సుబ్బలక్ష్మి

భారంగా గడిచిపోతున్నాయి రోజులు కాలచక్రం గిర్రున తిరిగిపోతుంది కానీ వారి జీవితాల్లో మాత్రం మార్పు రావటంలేదు ఒకరి నొకరు అర్ధం చేసుకోకుండా — రెండు విభిన్న ధృవాల్లా అతికీ అతకనట్లుగానే గడుపుతున్నారు సంసార జీవితాన్ని

* * *

"ఏమిటేవ్? ఇంకా ఆపరేషన్ చేయించుకోలేదు! యింకా ఎంతమంది పిల్లల్ని కనాలని ఉంది మిటి?" వేళాకోళంగా అడిగింది సుబ్బలక్ష్మి స్నేహితురాల్ని

"నాకు చేయించుకోవాలనే వుంది! ఆయనకే యిష్టంలేదు ఆయనకి చిన్న పిల్లలంటే గొప్ప యిష్టం అందుకేమరి ఆయన అభిప్రాయాన్ని అడ్డుచెప్పటం యిష్టంలేక"

"ఊ! యిష్టంలేక? యింకా పిల్లల్ని కంటా నంటావ్? అంతేనా?" ఆశ్చర్యంగా అడుగుతున్న సుబ్బుల్ని వింతగా చూస్తూ —

"మరి? వద్దంటావా? ఏమేవ్ సుబ్బులూ! నువ్వెన్ని చెప్పు మా వారి మాటే నామాట అయన యిష్టమే నా యిష్టం ఆయనకి నచ్చితేచాలు! నాకు నచ్చని పనయినా చేస్తాను ఆయనకి ఇష్టం లేకపోతే చాలు అ పనికి అప్పటితో స్టే, ఫుల్‌స్టాప్!"

మొహంమీద కొట్టినట్లయింది సుబ్బులికి మొహం మాడిపోయింది "సరే నీయిష్టం! వస్తానే" అంటూ ఫ్రెండ్ దగ్గర శలవు తీసుకొని బయలుదేరింది హడావిడిగా తను యింతవరకూ చేసిన తప్పేమిటో తెలుసుకున్న సుబ్బులు — "నన్ను క్షమించు నాధా!" అని మనసులోనే వేడుకుంది చిట్టిబాబుని

* * *

"ఏమిటోయ్ డ్రామా టిక్కెట్లు కొన్నావ్! నీకంత యిష్టమా డ్రామాలంటే?" చిరునవ్వుతో ప్రశ్నించాడు చిట్టిబాబు ఫ్రెండ్‌ని

'నాకు పరమ అసహ్యమోయ్ ఈ రాగాల డ్రామాలంటే! ఈ టేస్టు, నా భార్యారత్నానిది! దానికి తగని పిచ్చోయ్ ఈ డ్రామాలంటే! అందునా కురుక్షేత్రం డ్రామా అంటే — ఇక ఈ రాత్రినుంచే మానేస్తాది నిద్రాహారాలు!"

"నిజంగా!" ఆశ్చర్యపోతూ అడిగాడు చిట్టిబాబు

"ఊ! అందుకే నా కిష్టం లేకపోయినా తనని తీసుకువెళతా! తప్పుతుందా మరి! వాళ్ల కోరికలు భర్తలమయిన మనంకూడా తీర్చకపోతే ఎవరు తీరుస్తారు?" నవ్వుతూ వెళ్లిపోతున్న ఫ్రెండ్‌ని అలానే చూస్తూ వుండిపోయాడు చిట్టిబాబు

"వీడికి ఎంత యిది భార్య అంటే! వీడికి యిష్టంలేకపోయినా భార్యకోసం అయినా డ్రామాలు చూస్తాడట! మరి తను? సుబ్బులికోసం — కనీసం ఒక్కసారయినా తనతో కలిసి హిందీ సినిమా కెళ్లాడా?

ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకున్న చిట్టిబాబు—తను ఇంతవరకూ చేస్తున్న తప్పేమిటో

# ప్రశ్నావళి

**-కె రామలక్ష్మి**

ఎస్ ఎస్ ఆర్ కాకినాడ

14-4-74 విజయవాడ రేడియో నుంచి 'నేటి ఆధునిక సాహిత్యంలో రచయిత్రుల స్థానం' అనే అంశం మీద చర్చ జరిగింది ఎవరో అరుణజ్యోతి, మూర్తి, ప్రసాద్ గారలు పాల్గొన్నారు వారెవరో తెలుపలేదు వారు తేల్చిన దేమిటి అంటే - రచయిత్రులు ఏదో ఊ . లోకంలో నుండి రచనలు చేస్తున్నారు వారి రచనలో వైవిధ్యం లేదు సాహితీ విలువలు లేవు అంటూ . . చారు దీనిపై మీ అభిప్రాయం

★ కనీసం ఒక్క పురాణం పేతన వేసినా కాస్త ఘాటుగా వుండేదేమో— చర్చ - ఆ స్టేషను డైరెక్టరుగారి కెందుకు తోచలేదో మరి ఎవరు రాసినా ప్రతి రచనా శాశ్వతత్వానికి నోచుకోదు ఇక దానికి రచయిత్రులను తప్పుపట్టడంలో అర్థంలేదు ఇక వైవిధ్యం — మాదిరెడ్డి సులోచన రాసినన్ని వైవిధ్యం గల ఇతివృత్తాలు— ఏ మగ రచయిత రాశాడు ? సాహితీ విలువలు — ఆకాడమీ బహుమతి కూడా సాహితీ విలువకు కొలబద్దే కదా — మరి బీనాదేవి (ఆడదే అని నమ్మితే) ఆమెకు రాలేదా ? రంగనాయకమ్మకు రాలేదా ? సీతాదేవికి రాలేదా ? యిక ఊహాలోకాల అంచుల వూగులాడని రచయితలు — యిప్పుడే కాదు — ప్రబంధ కాలంలో కూడ లేరండీ — చూసె — వచ్చె — కాల్చె అనో — చూసి — పోయె — చంపె అనో రాసేస్తే చాలా ?! ఇంతకీ ఆ వారి రచనలను పక్షపాతంతో . . . సహృదయంతో పరిశీలించి చర్చిస్తే అర్థం వుండేది కనీసం కొంతైనా ఉపయోగం వుండేది! . . . బెజవాడ వినకపోవడమే . . . అప్పుడే ఒళ్లు . . .

జి వి ఆర్ ఆర్ విశాఖపట్నం

మీరు ఎక్కువగా ఎటువంటి సాహిత్యం చదువుతారు ?

★ చదవడం విషయంలో నా అలవాట్లు చాలా సిల్లీగా ఉంటాయి చదువుకునే రోజుల్లో 'అయ్యో, వాళ్లవి చదవలేదా ?' 'అరె, యులిసిస్ చదవేలేదా ?' అనేటంత నవనాగరికుల మధ్య తిరిగి అవి చదవా — అర్థం అయినా కాకపోయినా అన్న పంతంతో . . . అప్పట్లో (మీరంతా . . . తారల గురించి . . . కొనేటట్లు!) పికాసో, . . . యులిసిస్, షేక్స్పియర్, మిల్టన్ . . . వూతపదాలు సంభాషణలో . . . వడం — ఫాషన్ ఆ తరవాత శ్రీ శాస్త్రి లైబ్రరీలో జీవిత చరిత్ర లెక్కువ వుండేవి నవలా సాహిత్యం మచ్చుకైనా లేదు ఓసారి యీ సంగతే అడిగాను వారిని 'ఏం చదివినా సరదాకి చదవవచ్చును కాని ఏదైనా నేర్చుకుందుకని చదువుదామనుకుంటే జీవిత చరిత్రలే చదవాలి మానవత్వపు మహోపాధ్యాయులే మహానుభావుల జీవితాలు' అన్నారు అప్పటి నుంచి ఆ పిచ్చి పట్టింది నెపోలియన్ జీవిత చరిత్ర దగ్గర నుంచి 'మెమోయిర్స్ ఆఫ్ ఎ కాల్ గరల్' దాకా ఏదైనా చదివేయడమే! పిల్లలు, సంసారం యివన్నీ సిద్ధం అయాక — పొట్లాల కాగితాల మీద ఏమైనా రాసినది వున్నా ఓసారలా చదివేస్తాను ఇప్పుడు నా చేతిలో ఏదైనా పుస్తకం వుంటే — అది నా చిన్న కూతురు దగ్గర్నుంచి 'ఛ బోర్' అనో 'అద్భుతం' అనో ముందే చెప్పేస్తుంది! యింకెందుకు నేను చదవాలి ?

పి ఎస్ ఎన్ ఆర్ విజయవాడ

ఒక స్త్రీకి మాతృత్వం పొందడంలో ఎంత హాయి వుందో — చదువుకున్నవాడికి ఉద్యోగం దొరికితే అంత హాయి వుంటుంది

★ మీరు చాలా పొరపాటు వూహిస్తున్నారు మాతృత్వం స్త్రీకి హాయి కాదు — జీవన్మరణ సమస్య ఓ ప్రసవం కళ్లతో చూస్తే - మళ్లీ ఈ మాట అనరు మీరు బిడ్డ ఆనందాన్నిస్తుంది ఉద్యోగం ధైర్యాన్నిస్తుంది అనండి — ఒప్పుకుంటాను

ఎమ్ వి కె సికింద్రాబాదు

ఏ రోజుకా రోజు ఉత్సాహం తగ్గిపోతోంది ఏం చెయ్యాలన్నా

★ చూడండి సార్, ఒక్క ఎలక్ట్రిక్ బల్బు ఒక్కోటే రాత్రంతా వెల్గి ఆరినా, తిరిగి వెల్గించగానే ప్రకాశవంతంగా వుంటుంది మనిషి శక్తి కొంచెం కొంచెం తగ్గుకుంటూ రావడంలో — వింత లేదు

టి ఆర్ శ్రీకాకుళం

కె రా గారూ, తప్పు చేసినవాడు దేవుడిని కొలుస్తాడు తప్పు చెయ్యనివాడు దేవుడిని కొలుస్తాడు దేవుడు న్యాయం ఎవరికి చేకూరుస్తాడు చెప్పండి ?

★ తప్పు చేసిన వాడికే — న్యాయం తలపెట్టాలి నిజమైన దేవుడు ఎందుకో తెలుసా ? చేసిన తప్పుకి క్షమార్పణ వేడుకుంటున్నందుకు తప్పు చెయ్యనివాడు — యికపై తప్పు చెయ్యడని — ఏమిటి గ్యారంటీ ? ? ●

---

తమ కాపురం నరకప్రాయం కావటానికి కారణం ఏమిటో ఇట్టే గ్రహించాడు

"నన్ను క్షమించవే! సుబ్బులూ" మనసులోనే అనుకుంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడు, చిట్టిబాబు

* * *

స్కూటరు ఆపి యింట్లో అడుగు పెట్టిన చిట్టిబాబు — హెచ్చు ధ్వనిలో విన్పడుతున్న రఫీ పాట — విని ఒక్క క్షణం ఆశ్చర్యపడిపోయాడు ఏమిటబ్బా! ఈ విడ్డూరం! అనుకుంటూ రేడియో సౌండు తగ్గించి కుర్చీలో కూలబడ్డ చిట్టిబాబు ఎదుట టీపాయ్ మీద యాష్ట్రేని చూచి — బయటకు గిరాటుపెట్టాడు కోపంగా మరి యింతకాలం తమ కుటుంబ కలతలకి అది కూడా ఒక కారణమేగా! అప్పటికి అక్కడికి వచ్చిన సుబ్బలక్ష్మి—చిట్టిబాబుని చూసి "వచ్చారా! మీకోసమే ఎదురుచూస్తున్నా!" గోముగా అంటూ పక్కకు చేరింది

"ఉహూ! ఏమిటి విశేషం ?" అంటూ మల్లెపూలని తలలో తురిమాడు చిట్టిబాబు అలా ప్రేమపూర్వకంగా మల్లెలని జడలో పెడుతున్న

## మళ్లీ కథ మొదటికొచ్చింది

చిట్టిబాబుని అనురాగపూర్వకంగా హత్తుకుంటూ,

'ఏమీలేదు మై డియర్ నాథా! ఈ రోజు నుంచి మీ టేస్టే — నా టేస్టు! మీకు నచ్చిన పని మీరు చేసుకోవచ్చు — నా కిష్టంలేకపోయినా! మీరు సిగరెట్లు కాల్చవచ్చు — రఫీ పాటలు వినవచ్చు! నా కభ్యంతరం లేదు ఇప్పటినుంచి నేనూ మీతో తెలుగు సినిమాలకి వస్తా! యిప్పటి నుంచి మనం హాయిగా — ఆనందంగా గడపాలి సంసారం! ఈరోజు హాయిగా 'శారద' సినిమాకి పోదాం! టిక్కెట్లు కూడా బుక్ చేయించేసా! ఓకే!" విలాసంగా భర్త మెడని చుట్టేస్తూ అంటున్న సుబ్బలక్ష్మి మాటలకి కొయ్యబారిపోయాడు చిట్టిబాబు

"హార్ని! ఎంతపని చేశావ్!" అన్నాడు చిట్టిబాబు తేరుకొని

"ఏం ? ఎందుకలా అయ్యిపోతున్నారు ?" ఆతృతగా అడిగింది సుబ్బలక్ష్మి — భర్త ముఖం చూసి

"నేను నీకంటే ముందుగానే మారిపోయాగా మరి! అందుకే 'బాబీ'కి రెండు టిక్కెట్లు బుక్ చేయించుకు వచ్చాను" ఉసూరుమంటూ చెప్పాడు చిట్టిబాబు

ఒక్కసారిగా ఆశ్చర్యపడిపోతూ—

"ఏమిటీ! బాబీకి తెచ్చారా టిక్కెట్లు ? ఎవరి నడిగి తెచ్చారు ? మిమ్మల్నెవరు తెమ్మన్నారు ? డబ్బులు తగలపెట్టేస్తున్నారు యిలాంటి వేస్టు పనులు చేసి!" చిరాగ్గా మందలించింది సుబ్బులు

"నువ్వు అడ్వాన్సు తీసి వుంచుతావని నేనేమన్నా కలగన్నానా ? అయినా నిన్నెవరు శారదకి టిక్కెట్లు తీయమన్నారు ? నువ్వేదో మహా పొదుపు చేస్తున్నట్లు చెబుతున్నావ్!" రెట్టించాడు చిట్టిబాబు

అంతే! మళ్లా మామూలు పరిస్థితే! నువ్వెంత ? అంటే, నువ్వెంత

" జరగడంతో మళ్లా మామూలు పరిస్థితి ఏర్పడింది — వార్తలు సమాప్తం!!" రేడియోలో విన్పడుతున్నాయి మాటలు విసురుగా రేడియో కట్టి మంచంమీద వాలిపోయింది సుబ్బలక్ష్మి టిక్కెట్లని ముక్కలుచేసి, అంతకంటే విసురుగా బయటకు వెళ్లిపోయాడు చిట్టిబాబు సిగరెట్ల కోసం!

"బాబు పొడుగ్గా, వెడల్పయిన భుజాలతో, గట్టి, తెల్లని పళ్ళతో పెరుగుతాడు."

"ఎందువల్లనంటే, నేను కాల్షియం-శాండోజ్ తీసుకుంటున్నాను గనుక"

మీ పసిపాప పళ్ళూ, ఎముకలూ మీరు గర్భిణితో ఉన్నప్పుడే తయారవటం మొదలెడతాయి అప్పుడే పాపకు కాల్షియం అత్యవసరం దానిని మీరే ఇవ్వగలరు! తేలికైన కాల్షియం శాండోజ్ పద్ధతిలో (

రోజుకు మూడుసార్లు 3 4 బిళ్ళల చొప్పున కమ్మని, రాస్ప్బెరి రుచి కలిగి విటమిన్లు ఎ, డి మరియు బి12తో పుష్టివంతం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళను చప్పరించండి. మీ పాప గట్టి పళ్లూ పటిష్టమైన ఎముకలూ కలిగినదిగా తయారు అవుతుంది. మీకు కాల్షియం లోపంగాని కాళ్ళు పట్టటంగాని, కండరాల నొప్పిగాని ఉండదు

శాండోజ్‌ను విశ్వసించండి—వారు ప్రపంచంలో శుద్ధమైన కాల్షియం తయారీ చేయడంలో ముందంజ వేసారు







SANDOZ

కాల్షియం-శాండోజ్®

ప్రతి రోజు ప్రతివారికి

dCP/CS/9d Tel

## ★ చిన్నారి చిలిపి చేష్టలు ★



మా మూడు సంవత్సరాల బాబు ఖాళీ బోర్నవిటా డబ్బాని గచ్చుమీద దొర్లిస్తూ, కారు వెళ్ళున్నట్టుగా శబ్దం చేస్తూ 'పీ, పీ' 'ఈయ్' అంటూ ఆడుకుంటున్నాడు. వాడి అరుపులకి, దొర్లుతున్న డబ్బా శబ్దానికి, వంటింట్లో పనితో సతమతమౌతున్న నాకు చాలా చిరాకనిపించింది వాడికి మంచి మాటలు చెప్పి, వాడితో ఆ ఆటను మాన్పించాలనుకున్నాను వాడి దగ్గరకువెళ్లి 'ఒరేయ్, రాజా! నీకారు చాలా బాగుందే ఎంతక్కొన్నావ్! చాలా బాగా నడుస్తుందే! కాని ఎప్పుడూ అలా నడిపిస్తే కారు పాడైపోతుంది అందుకని ఇప్పుడు ఆపు చేసేయ్! సాయంత్రం నడిపించుకొందువ్‌గాని' అని అన్నాను వాడు నావైపు విచిత్రంగా చూస్తూ 'ఛో మమ్మీ, నీకేం తెలీదు! ఇది కారు కాదు! డబ్బా' అని చిరునవ్వు నవ్వేసి మళ్లీ తన ఆటలో మునిగిపోయాడు.

—కస్తూరి సూర్యకుమారి,
(బొకారో స్టీల్ సిటీ)

## అబల

(18వ పేజీ తరువాయి)

ఆ రోజు మాధవి మనసేమీ బాగుండలేదు పరీక్ష ఫీజు కట్టటానికి అది ఆఖరి రోజు తన దగ్గర పట్టుమని పదిరూపాయలు కూడా లేవు అర్జెంట్‌గా డబ్బు పంపమని అన్నగారికి టెలిగ్రామ్ యిచ్చింది కాని డబ్బు పంపుతాడనే నమ్మకం మాత్రం ఆమెకు లేదు తన విషయంలో గాని —డబ్బు విషయంలో గాని వదినగారు ఎంత నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తారో ఆమెకు తెలియందికాదు

ఏదో అన్నగారి మంచితనమూ అని మెడిసిన్‌లో చేరింది అంతేకాని తనకు అన్నీ వుండిగాని, ఎంతో ప్రోత్సాహం వుండిగాని చదవటంలేదు పరంధామయ్యగారి పుణ్యమా అని అంత పెద్ద పట్టణంలోనూ, కాలేజీకి దగ్గరలో యిరవై రూపాయలకే ఒక గది దొరికింది తన మంచి తనంతో ఆయనగారి మనసులో స్థానం సంపాదించుకుంది అందుకే రెండేసి నెలలు తను అద్దె యివ్వకపోయినా ఆయన అడిగేవారు కాదు పైగా తనకే అమ్మాత్రం యీమాత్రం డబ్బు సర్దుతూ వచ్చారు తన కష్ట సుఖాలు తెలుసుకుని, తనకి ఎంతో ధైర్యాన్నిస్తూ ఎన్నో విధాల సహకరిస్తున్నారు ఆయన. ఆ విషయంలో మాధవికి ఆయన మీద ఎంతో కృతజ్ఞతా భావం వుంది

ఆ చనువుతోనే యిప్పుడు పరంధామయ్యగారిని డబ్బు అడుగుదామనుకుంది కాని అడగలేకపోయింది అప్పటికే ఆయనకి మూడు నెలల అద్దె, ఆపైన కొంత డబ్బు కూడా ఋణపడి వుంది. అలాంటి పరిస్థితిలో ఆయనను మళ్లీ డబ్బు అడిగితే బాగుండదనుకుంది ఆయన కూడా పెద్ద డబ్బుగలవాడేమీకాదు ఏదో వున్నదానితో వెళ్లబుచ్చుతున్న మధ్యతరగతి కుటుంబీకుడు ఆ విషయం మాధవికి బాగా తెలుసు అందుకే సాహసించలేక పోయింది

అయితే ఫీజు కట్టటానికి ఎవరిని డబ్బు అడిగితే బాగుంటుందో ఆమెకి అర్ధంకాలేదు తనకున్న స్నేహితుల్ని ఎవర్నీ డబ్బు అడగలేక పోవటం తన బలహీనతేమో అనుకుని బాధపడేదీ అదీ ఒకందుకు మంచిదే అని అంతలోనే తృప్తిపడుతూ వుండేది అందుకే చనువుగా ఎవరినీ సహాయం అడగలేకపోయింది

ఎవరికీ అర్థంచకపోతే- పరీక్షఫీజు కట్టకపోతే ఆరునెలలు వృధా అవుతుంది తను పడ్డ కష్టమంతా వ్యర్థమవుతుంది అలాంటి పరిస్థితుల్లో ఏంచెయ్యాలో తెలీక కుమిలిపోతోంది

ఆ మధ్యాహ్నం మాధవి క్లాస్‌కి వెళ్లలేకపోయింది భోజనం చేయకుండా, మంచంమీద పడుకుని ఆలోచిస్తూ వుండిపోయింది 'తనకీ అమ్మా—నాన్నా వుంటే ఎంత బాగుండును' అనుకుని కంటతడి పెట్టింది జాలిపడి కన్నీరు తుడవటానికి ఎవరూ రాలేదు

ఆ రాత్రంతా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది మర్నాడు వార్డ్‌కి బయలుదేరిన మాధవి తిన్నగా కాంటిన్‌కి వెళ్లింది.

గిరి కనిపించాడు. అతన్ని పిలిచింది మాధవి

"అరె మీరా . ఏమిటి యిలావచ్చారు" అంటూ కంగారుపడి కాలుస్తున్న సిగరెట్ విసిరేసాడు

"ఏమీలేదు" అంటూ- "మీతో కొంచెం పనుంది" అంది సంశయిస్తూ

"ష్యూర్ ష్యూర్ ఏమిటో చెప్పండి" అంటూ కాస్త దగ్గరకు వచ్చాడు

"అర్జెంట్‌గా నాకు యాభైరూపాయలు కావాలి" అంది

అ ప్రక్కనే కూర్చుని వున్న మధు చురుకుగా వెనక్కు తిరిగి చూశాడు మాధవి ఉలిక్కిపడింది మధుమూర్తి తన క్లాస్‌మేటే అయినా అతనితో ఆమెకి పరిచయం మాత్రం లేదు అయినా అతను బాగా చదువుతాడనీ, మంచివాడనీ ఆమెకి ఒక అభిప్రాయం వుంది

కాని తన మాటలు విన్నాడని తెలిసిన దగ్గరనుండీ ఆమె మనసు మాత్రం అదోలా అయిపోయింది దానికితోడు గిరి వెంటనే సమాధానం ఇవ్వకపోయేసరికి మరీ యిదైపోయింది

"నాదగ్గర అంత డబ్బులేదు . అందాకా ఈ ముప్పయి తీసుకోండి" అంటూ డబ్బు తీసియిచ్చాడు గిరి

'థాంక్స్. మీమేలు ఈజన్మకి మర్చిపోను' అంది అతనివైపు తృప్తిగా చూస్తూ

"మరీ అంతగా ప్రెయిజ్ చెయ్యకండి ." అన్నాడు చిలిపిగా నవ్వుతూ

మాధవి మనసు తేలిక పడింది

మర్నాడు ఫీజుకట్టటానికి ఆఫీసుకి బయలు

# 1947, స్వాతంత్ర్య దినానికి ముందు మీరు జన్మించినట్టయితే ఈ ప్రకటన పూర్తిగా చదవండి.



## 30 ఏళ్ళ వయస్సు సమీపిస్తున్న ప్రతి పది మందిలోనూ తొమ్మండుగురి జుట్టు రాలిపోతోంది అయితే వారికి ఈ సంగతి తెలీదు

### ఆ తొమ్మండుగురిలో మీరూ ఒకరయితే ఇవాళ్టినుంచి పూ్యర్ సిల్విక్రిన్ వాడటం ప్రారంభించండి

మీరు దువ్వుకుంటున్నప్పుడు దువ్వెనతో వచ్చిన శిరోజాలు మీకు చెబుతున్నాయి —మీ జుట్టు ఊడిపోతోందని మీ జుట్టు పల్చబడుతోందని అర్థం స్పష్టం చేసే ముందరే మీరు జాగ్రత్త పడవలసిన సమయం పూ్యర్ సిల్విక్రిన్‌ని ఇవాళ్టినుంచి వాడటం ప్రారంభించండి

### పూ్యర్ సిల్విక్రిన్ జుట్టు ఊడిపోకుండా నివారిస్తుంది

జుట్టు ఆరోగ్యానికి అవసరమైన 17 ప్రధాన అమినో ఆసిడ్స్ పూ్యర్ సిల్విక్రిన్‌లో ఉన్నాయి ఇది త్వరితంగా లోపలికి ప్రవేశించి జుట్టు కుదుళ్ళవరకూ చేరుకుంటుంది జుట్టుకి సహజంగా లభించే ఆహారంలో గల లోటుని భర్తీ చేస్తుంది జుట్టు బలంగా ఆరోగ్యంగా పెరిగేటట్టు చేస్తుంది

### సత్ఫలితాలకోసం క్రమం తప్పకుండా వాడాలి

పూ్యర్ సిల్విక్రిన్ వాస్తవంగా మంచి ఫలితాలు యివ్వాలంటే కనీసం 6 నెలలు క్రమం తప్పకుండా వాడాలి అప్పుడప్పుడు వాడితే లాభంలేదు ప్రతిరోజూ రోజుకి రెండుసార్లు కొద్దిగా పూ్యర్ సిల్విక్రిన్‌ని మీ తలపై మర్దనా చేయండి మీ జుట్టు మామూలు స్థితికి చేరుకునేవరకూ రోజూ యిలా చేయండి ఆ తర్వాత సిల్విక్రిన్ హెయిర్ డ్రెసింగ్ మీకు అవసరం చమురు పూ్యర్ సిల్విక్రిన్ మిళితమై ఉన్న ఒకే ఒక హెయిర్ డ్రెసింగ్ ఇదే ముందు ముందు ఏర్పడబడి మీ శిరోజాల సంపూర్ణ సంరక్షణ అవసరం




### పూ్యర్ సిల్విక్రిన్ ఎలా పనిచేస్తుంది !

(1) ఒక చుక్క పూ్యర్ సిల్విక్రిన్‌ని పెద్దది చేసి పరీక్షించారు పూ్యర్ సిల్విక్రిన్‌కి సాటి మరేదీ లేదు శిరోజాలకి శరీరంనుంచి సహజంగా లభించే చమురులోని 17 అమినో ఆసిడ్స్ పూ్యర్ సిల్విక్రిన్‌లో సమ్మిళితమై ఉన్నాయి

( ) శిరోజాలకి సహజ ఆహారమైన ముఖ్య అమినో ఆసిడ్స్ లోటువల్ల జుట్టు అనారోగ్యంగా పల్చగా పెరుగుతుంది ఈ లోపాన్ని సరిదిద్దకపోతే జుట్టు రాలిపోతూనే ఉంటుంది

(3) పూ్యర్ సిల్విక్రిన్ జుట్టు కుదుళ్ళవరకూ చేరుకుని లోటుగా ఉన్న సహజ ఆహారాన్ని తిరిగి సమకూర్చి మళ్ళీ ఆరోగ్యంగా పెరిగేటట్టు చేస్తుందని వైజ్ఞానిక పరిశోధనా ఫలితులవల్ల రుజువైంది




# పూ్యర్ సిల్విక్రిన్

శిరోజాల సహజ ప్రొటీన్ ఆహారం

mcm/po/997

దేరింది. దారిలో గిరి కనిపించాడు

"ఎక్స్‌క్యూజ్‌మీ " అంటూ దగ్గరకు వచ్చాడు

"ఏమిటండీ" అంటూ చిన్నగా నవ్వింది

"మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు గిరి

"ఏమిటో చెప్పండి" అంది మాధవి అతనివైపు ఆశ్చర్యంగా చూస్తూ.

"మీరేమీ అనుకోకపోతే" అంటూ నసిగి— మీకు అభ్యంతరం లేకపోతే నడుస్తూ మాట్లాడుకుందాం ఓకే" అన్నాడు దారితీస్తూ

మాధవి చిన్నగా నవ్వి అతని ప్రక్కనే నడక ప్రారంభించింది

"ఏదో మాట్లాడాలన్నారు" అంటూ గుర్తుచేసింది

"ఆ . ఎస్ ఎస్" అంటూ మాటలు తడబడి ఆమెవైపు పట్టి పట్టి చూశాడు ఆచూపుల్లో ఏముందో తెలీదు.కాని మాధవి కుంచించుకు పోయింది చూపులు తిప్పుకుని మౌనం వహించింది

"ఎప్పటినుంచో మిమ్మల్ని ఒకటి అడగా లనుకుంటున్నాను" అన్నాడు

"ఏమిటది"

"అహ యిటీజ్ వెరీసింపుల్ నాకు తెలీదనుకోండి అయినా పెద్దలంటుంటే విన్నాను . ఏడడుగులు కలిసి నడిస్తే యిద్దరూ ఒకటవుతారటకదా నిజమేనా?" ఆ మాటలు చెప్పటానికి అష్టవంకరలూ తిరిగిపోయాడు.

"ప్రతిరోజూ చాలా మందితో కలిసి

## అబల

ఏడడుగులు పైనే నడుస్తున్నాం... అయితే ఒకటైపోతున్నా మంటారా ?" తెలివిగా తప్పించుకోటానికి ప్రయత్నించింది

"అయ్ డోంట్ మీన్ దట్‌వే ."

"మరి" విసురుగా వచ్చింది ఆ ఒక్క మాటా

"మీరు . మీరు ... నాకు కావాలి" తేల్చేశాడు గిరి

"గిరీ ఏమిటి మీ రంటుంది"

"అవును మాధవీ .ప్లీజ్ ది సీజ్ మై లాంగ్ ట్రైవింగ్ విష్...డోంట్‌సే నో.. నా కోరిక తీర్చారంటే మీకు కావలసినంత "

ఆ పైన మాధవికి ఏమీ వినిపించలేదు నెత్తిమీద పిడుగు పడ్డట్లయ్యింది.

గిరి ఇంకా ఏదో చెప్పాలని తాపత్రయ పడ్డాడు కాని మాధని మాత్రం అవకాశం యివ్వలేదు

"ఛీఛీ మీరింత నీచంగా ఆలోచిస్తా రనుకోలేదు మిస్టర్ గిరీ . మీ డబ్బు చూసి అమ్ముడు పోతాననుకున్నారు కదూ ? మీ స్వభావం నాకు తెలుసు. తెలిసివుండి కూడా నోరు విడిచి అడగటం నాదే బుద్ధితక్కువ ఛఛ ఎంత పొరపాటు చేశాను యిదిగో మీ డబ్బు తీసుకోండి యింకెప్పుడూ యిలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేయకండి నేను పేదరాలినే కావచ్చుకాని ..ఎప్పుడు కావాలంటే అప్పుడు కొనుక్కోటానికి బజారులో వస్తువుని కాదు మనిషిని గిరి ప్లీజ్ మైండ్‌యిట్"అని యింకోమాటకి ఎదురు చూడకుండా డబ్బు చేతిలో పెట్టి వెనక్కి నడిచింది

"ప్లీజ్ మాధవీ నేను చెప్పేది కాస్త వినండి" ఆమెను అనుసరించటానికి ప్రయత్నించాడు కాని సాహసించలేకపోయాడు

మాధవిమాత్రం అతగాడి వలలో చిక్కకుండా తప్పించుకుంది

మాధవి మనసు అవమానంతో కృంగిపోయింది తాను ఏం చెయ్యాలనుకుందో, ఏం చేసిందో ఏమీ అర్థం కాలేదు ఆమెకి ' గిరిని డబ్బు అడగకుండా వుంటే ఎంతబాగుండును రాస్కెల్ డబ్బు యిచ్చి నువ్వు కావాలి అంటాడా ఎంత ధైర్యం లేదులేదు యిందులో అతని తప్పేమీ లేదు తప్పంతా తనదే తమ యిద్దరిమధ్యావున్న పరిచయం ఎంతగనుక? ఆమాత్రం పరిచయంలో అంత చనువు తీసుకోవటమే తను చేసిన పొరపాటు ఎందుకు తనంతగ్రుడ్డిగా ప్రవర్తించింది ఛీ ఛీ ఏమిటే పాడుబ్రతుకు'అని వాపోయింది కుమిలి కుమిలి ఏడ్చింది

ఆ రోజు కాలేజీ మానేసింది గదిలో కూర్చుని చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయింది ఆఖరికి ఒక నిర్ణయానికి వచ్చింది

పరంధామయ్యగారి దగ్గరికి వెళ్లి డబ్బు అడిగింది ఎందుకు అని అడగకుండా యాభై రూపాయలు తెచ్చియిచ్చారు ముందే తనకా బుద్ధి పుట్టివుంటే ఎంతబాగుండుననుకుంది మనిషి తను అనుకున్నట్లు ఏపనీ చెయ్యలేడు ఒకవేళచేసినా అనుకున్నట్లు జరగదు ఒకవేళ జరిగినా అనుకున్న ఫలితం మాత్రం దక్కదు. అదే మాధవి విషయంలో నిజమయింది

ఫీజ్ కట్టటానికి ఎంత పైను కట్టాలో తెలుసుకోటానికి ఆఫీసుకి వెళ్లింది

క్లర్క్ ఆశ్చర్యంగా చూశాడు —

"మీరు ఫీజ్ కట్టేశారు కదండీ చలాను నిన్నే ఆఫీసుకి వచ్చింది" అన్నాడు

"పొరపడుతున్నారు సరిగ్గా చూడండి నేనింకా ఫీజ్ కట్టలేదు" అంది ఆత్రుతగా.

"లేదండీ నాకు బాగా గుర్తుంది మధుమూర్తి అంటారు చూడండీ సన్నగా పొడుగ్గా వుంటారు ఆయనే తీసుకువచ్చి యిచ్చాడు .మీరు అప్లికేషన్ ఫిలప్ చేసేస్తే ఈ రోజు పోస్ట్‌లో పంపించేస్తాను" అంటూ చలానుచూపించిఅప్లికేషన్ ఫారమ్‌అందించాడు

మారు మాట్లాడకుండా పని పూర్తిచేసి బయటకు వచ్చింది



# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**టి. ఆర్ ఎల్ అనకాపల్లి.**

నాకు పదవ ఏట చెవుడు వచ్చినది ప్రస్తుతం నా వయస్సు 26 సం లు. 3 సం లు క్రింద చెవులో చీము కారింది అప్పటి నుంచి మరీ ఎక్కువ యింది ఎన్ని మందులు వాడినా ఫలితం కనిపించటం లేదు

మీరు నిపుణులైన ఇ. ఎన్. టి. వైద్యులను సంప్రదించండి మదరాసులో డా సుబ్రమణ్యం గారినో, సత్యనారాయణగారినో కలిసి, వారు ఆపరేషన్ చెయ్యాలంటే చేయించుకుంటే తప్పక చెవుడు పోతుంది

బి వి ఎమ్ జగిత్యాల

'సూడో ప్రెగ్నన్సీ' అంటే ఏమిటి? ఫామిలీ ప్లానింగ్ పిల్స్ వాడే వారు సన్నగాగాని, లావుగాగాని అవడానికి అవకాశం ఉన్నదా? ప్రసవించిన తర్వాత మొదటిసారి ఋతుక్రమం రాకముందే గర్భం వచ్చే అవకాశం ఉందా?

మీరు వ్రాసిన ప్రశ్నలను బట్టి మీకు ఎవరో వివరంగా చెప్పే ఉంటారనిపిస్తోంది అంటే నా 'సూడో ప్రెగ్నన్సీ' అంటే నిజంగా గర్భం అవకుండానే గర్భిణీ లక్షణాలు కనపడటం ఫామిలీ ప్లానింగ్ పిల్స్ వాడిన తర్వాత కొందరు లావెక్కటం నిజమే! ఎందువల్లనంటే, హార్మోనుల పరివర్తనం శరీరంలో ఎక్కువ అవటం! ప్రసవించిన తర్వాత ఋతుక్రమం రాకుండానే గర్భం రావచ్చును— కాని అలా జరగటం చాలా అరుదు

కె ఎస్ యు బెంగుళూరు

నాకు 'టి బి గ్లాండ్స్' ఉన్నవి డాక్టరు సలహా వల్ల ఆపరేషన్ చేయించుకున్నాను ఇప్పుడు ఇంజక్షనులు వేయించుకొంటున్నాను ఇవి మళ్లీ వచ్చే అవకాశం ఉన్నదా?

సక్రమ పద్ధతిలో వైద్యం చేయించుకొన్నప్పుడు తిరిగిరావటానికి అవకాశంలేదు స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్లు వారానికి రెండు సార్లు, ఇసోనెక్స్ మాత్రలు రోజుకి మూడు మాత్రలు లేక వారానికి ఒకేసారిగా 6½ మాత్రలు వాడాలి ఇలా 1 సం క్రమం తప్పకుండా వాడితే తిరిగి రావడానికి అవకాశం లేదు

బి వి ఖమ్మం

నా చెల్లెలి వయసు 15 సం లు క్రమంగా 'మెన్సెస్' కాదు ఇలా అవటానికి కారణమేమిటి?

ఋతుక్రమం రావటం మొదలయిన కొన్ని నెలలు ఇలా ఉండటం సహజమే! దీనికి ఏమీ వైద్యం చేయనవసరములేదు బలానికి, 'ఫెర్సొలేట్' మాత్రలు రోజుకి ఒకటి వాడితే చాలు

యు ఎ

మా నాన్నగారి వయసు 46 సం లు కుడివైపు ఎదటి పన్ను వంపు తిరిగి చాలా బాధ పెడుతున్నదిట

పంటి నెప్పి ఉండి, దంతము చెడిపోయినపుడు తీసివేయటమే మంచిది లేకపోతే దీనివల్ల ఇతర దంతములు కూడా పాడైపోతాయి

నెప్పి తగ్గడానికి, ఆక్టిమాల్— రోజుకి రెండు మాత్రలవరకూ వేసుకోవచ్చును ప్రతి రోజూ 'టేబిల్ సాల్టు— వేడి నీళ్లలో వేసి పుక్కిలిస్తూ ఉంటే క్రిములు దంతముల వేళ్లలో చేరటానికి అవకాశం ఉండదు

చిగురు వాపు ఉంటే 'మాండిబాన్' మాత్రలు పూటకి ఒకటి వంతున రోజుకి రెండు పూటలు— అయిదు రోజులు వరుసగా వాడాలి నెప్పి తగ్గటానికి 'టాండరిల్' మాత్రలు రోజుకు 2 వాడవచ్చును

ఎస్ ఎమ్ ఏలూరు

బోదకాలు ఉన్న స్త్రీలో సంబంధం ఉన్న మగవారికి ఆ జబ్బు వస్తుందా?

బోదకాలు ఉన్న స్త్రీతో సంబంధను ఉన్నంత మాత్రాన ఈ రోగం రాదు అయితే ఈ బోదకాలు, క్రిములు ఉన్న దోమ కుట్టితే వచ్చే రోగం ఒకే ఇంట్లో ఉన్నప్పుడు, దోమలు ఎక్కువగా ఉన్నప్పుడు ఈ రోగం రాదని చెప్పటం కష్టం ●

---

కాని మనసులో మాత్రం ఆ విషయన్నే తీవ్రంగా ఆలోచిస్తూనే వుంది

మధుమూర్తి ఆ ఫీజ్ ఎందుకు కట్టినట్లు అన్న ఆలోచనలు ఆమెను ఒక్కసారి ముసురుకున్నాయి వుక్కిరిబిక్కిరి చేశాయి ఏదీ తేల్చుకోలేక క్షణకాలం సతమత మయ్యింది

ఎవరి మెప్పుకోసం అతగాడు ఆ పని చేశాడో తేల్చుకోవాలని నిర్ణయించు కుంది ఆఖరికి

లైబ్రరీకి వెళ్తూ ఎదురయ్యాడు మధుమూర్తి మాధవికి కోపం ముంచుకు వచ్చింది అతన్ని పిలిచింది తల వంచుకు వెళ్లిపోతున్న వాడల్లా ఆగిపోయాడు "పిలిచారా" అన్నాడు-నెమ్మదిగా.

"అవును" అంది మాధవి విసురుగా

ధైర్యంగా ఆమెవైపు నడిచి వచ్చాడు — "ఏమిటో చెప్పండి" అన్నాడు నిదానంగా

"ఎందుకు చేశారు ఆ పని " అంది కోపంగా.

"ఓహో అదా ." అని చిన్నగా నవ్వి — "మీరు యిప్పుడు ఆవేశంలో వున్నారు ఏం చెప్పినా మీకు అర్థంకాదు ప్లీజ్ నన్ను బ వంతం చెయ్యొద్దు ... సహృదయంతో

## అ బ ల

అర్థంచేసుకోటానికి ప్రయత్నించండి రేపు కలుస్తాను — అంతా వివరంగా చెప్తాను ప్లీజ్ వెళ్లిరండి" అంటూ సమాధానంకి ఎదురు చూడకుండా వెళ్లిపోయాడు మధు

ముఖం వాచేటట్లు తిట్టాలనుకుంది డబ్బు ముఖానికి వేసి కొట్టాలనుకుంది. కాని ఏమీ చేయలేకపోయింది

అప్పటి నుండీ మాధవి మనసు పూర్తిగా వికలమైపోయింది మధుమూర్తి ఆ పని ఎందుకు చేశాడో అర్థంకాలేదు ఇతనుకూడా తనని ప్రేమిస్తున్నాడా ఎందుకు ప్రేమిస్తున్నట్లు అని ఎంతసేపో ఆలోచిస్తూ వుండి పోయింది ఆ రాత్రంతా

ఈ రోజు—

పోస్టుమేన్ కేకవిని పరుగెత్తుకు వెళ్లింది అన్నయ్య డబ్బు పంపి వుంటాడు అని ఆశపడింది తీరా చూస్తే చిన్న కవరు చేతికిచ్చి వెళ్లిపోయాడు

గాఢంగా నిట్టూర్చి లోపలకు వచ్చింది కవరువిప్పి వుత్తరం బయటకు తీసింది.

మాధవిగారికి,

మీ అనుగ్రహంతో త్వరలోనే మాధవీ అని పిలిచే అవకాశం లభిస్తుందని ఆశిస్తూ వ్రాస్తున్న ఈ చిన్న లేఖను చివరి వరకూ చదవమని ప్రార్థిస్తున్నాను నా గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు ఎందుకంటే రోజూమీరు నన్ను చూస్తున్నారు గనుక—మీరు నాతో మాట్లాడకపోయినా, నా మనసు మాత్రం మీతో మాట్లాడుతూనే వుంటుంది మనసు మీ దగ్గర పెట్టుకుని మనసులేని మనిషిగా బ్రతకలేకపోతున్నాను అందుకే మీ మనసు నాకిచ్చి నన్ను ఒక మనసున్న మనిషిని చెయమని అడగటానికి సాహసిస్తున్నాను నేనెవరో ఆకాశరామన్న అనుకునేరుసుమా? అందుకే ముందు క్రింద వున్న నా సంతకం చూడమని కోరుతున్నాను— చదవటం ఆపి వుత్తరం తిప్పిచూసింది మాధవి సంతకంచూసి నివ్వెరపోయింది

తిరిగి ప్రారంభించింది—

అసలువిషయం చెప్పేముందు మీకు ఒకటి గుర్తు చేయాలనుకుంటున్నాను జీవితంలో మనిషికోరింది మనసుకోరదు మనసుకోరింది మనిషికి అందదు మనిషి కోరిందీ, మనసు

(44 వ పేజీ చూడండి)













అరవింద్
యొక్క
లీనో షర్టింగులు
కావాలని
అడగండి

మీ అభిరుచికి అనుగుణంగా
తేలికగా, నిర్విచారంగా
ధరించటానికి వీలైన కాటన్
షర్టింగులు, మీ మనసు నా కట్టే
రంగులలో మీ కోరికలను పురిగొల్పే
నేతలలో వస్తున్నాయి లీనో శ్రేణికి
చెందిన చల్లని హాయినిచ్చే బట్టలను
మించినవి లేవు

అరవింద్ మిల్స్

అందాలు విరబూసిన క్షణాలలో అందాలు విరజిమ్మే బట్టలు అరవింద్ బట్టలు

Interpub/AM/20/74 tel

చిల్లర దుకాణాలు: మెస్సర్స్ వెంకటేశ్, 243/244 ఎన్ ఎస్ సి బోస్ రోడ్, మద్రాసు 1 * మెస్సర్స్ ఆనంద్ టెక్స్‌టైల్స్ బిగ్ బజార్, త్రిచీ 8 * మెస్సర్స్ ఈశ్వరీస్ 26/బి వెస్ట్ టవర్ స్ట్రీట్, మధురై * మెస్సర్స్ ఇందిరా టెక్స్‌టైల్స్ 'డి' బ్లాక్, సి బి ఏ బి కాంప్లెక్స్ డిస్ట్రిక్ట్ ఆఫీస్ రోడ్, కొయంబత్తూర్ 9 అమ్మకపు ఏజెంట్లు మెస్సర్స్ ఇందిరా టెక్స్‌టైల్స్, 'డి' బ్లాక్, సి బి ఏ బి కాంప్లెక్స్, డిస్ట్రిక్ట్ ఆఫీస్ రోడ్ కొయంబత్తూర్ 9 * మెస్సర్స్ మధుభాయ్ అండ్ కో 37, మహాత్మా గాంధి రోడ్, సికింద్రాబాద్ * మెస్సర్స్ ఎ కె ఎస్. పటేల్ అండ్ కో, గుడివాడ వారి స్ట్రీట్, విజయవాడ * మెస్సర్స్ షా గణేష్‌మల్ ప్రతాప్‌మల్ అండ్ కో., జెయిన్ క్లాత్ మార్కెట్, బళ్ళారి.

# పత్రికా డైరీ

## మంత్రుల పర్యటనల ఖర్చు

మంత్రుల జీతాలకన్నా వారి పర్యటనలకే ఎక్కువ డబ్బు ఖర్చవుతోందట 1972—73 లెక్కల ప్రకారం మంత్రుల జీతాలకు 12 38 లక్షలు ఖర్చయితే వారి పర్యటనలకు 28 37 లక్షలయ్యిందట 1973—74 లెక్కల ప్రకారం జీతాలు 14 42 లక్షలు, పర్యటనల ఖర్చులు 38 90 లక్షలు అని తేలిందట ఈ విషయాలు లోక్‌సభలో హోమ్ డిప్యూటీ మంత్రి మిస్టర్ మోహిషిన్, అన్నారట 1973 జనవరి నుంచి 1974 జులై వరకూ దేశంలోని వివిధ రాష్ట్రాలలో ప్రధాని శ్రీమతి గాంధి చేసిన 84 పర్యటనలలో 17 మాత్రం ఉద్యోగరీత్యా చేసిన పర్యటనలు కావట

## ఆస్పత్రిలో మాయమయిన పసికందు !

అగస్టు నెల రెండోవారంలో (తేదీ సరిగ్గా తెలియ లేదు) మద్రాసు జనరల్ ఆసుపత్రిలో అవుట్ పేషెంటు వార్డు వద్ద మందు తెచ్చుకోడానికి ఒకా విడ తన పసికందును వో వారగా పడుకోబెట్టి వెళ్లి మందు తెచ్చుకువొచ్చే సరికి ఆ పసికందు అంతర్ధానం అయిపోయిందట ఈ విషయంలో పోలీసులు కెలగజేసుకు విచారిస్తే 22 వ తేదీన ఆ పసికందు పుదుప్పేటలో షిరాంత్‌బీబీ అనే వో బిచ్చగత్తె వద్ద దొరికిందట.

## ప్రమాదాలలో పోటీ

రోడ్డు ప్రమాదాలలో బొంబాయిది అగ్ర స్థానమట 1972 వ సంవత్సరంలో మొత్తం 29,575 రోడ్డు ప్రమాదాలు జరిగాయట రెండవ స్థానమైన కలకత్తాలో 12,613 రోడ్డు ప్రమాదాలు సంభవించాయట. స్కూటరు, మోటారు సైకిలు ప్రమాదాలలో మాత్రం ఢిల్లీదే ఫస్టు మార్కట విూ వూరెందులో ఫస్ట్ సార్!

## నష్టపరిహారం పొందిన ఖైదీ !

1973 జులై ఇరవయ్యో తేదీన వెస్ట్ జర్మనీ డూయిస్‌బర్గ్ కోర్టు ఒకమ్మాయిని బలాత్కరించిన నేరానికి 44 ఏళ్ళ ఇటాలోసెలాషినో అనే యిటలీ దేశస్థునికి వో సంవత్సరం జైలు శిక్ష విధించిందట అతనితోపాటు ఇద్దరు యుగోస్లావియా దేశస్థులకు, వో టర్కీ దేశస్థునికి కూడా శిక్షలు పడ్డాయట ఇటాలోసెలాషినో కోర్టులో మాట్లాడిన ఇటలీ భాషకు అర్థం జడ్జిగారితోపాటు ఎవరికి తెలియలేదట అతను తాను నిర్దోషిననీ, ఆ ముగ్గురూ బలాత్కరిస్తూంటే తాను అడ్డుకున్నాననీ మొర పెట్టుకున్నాడట అతను జైలు శిక్ష అనుభవిస్తుండగా ఇటలీ దేశస్థుడు మరొకడు వో నేరానికి అదే జైల్లో చేరి, యీ విషయం కూపిలాగాడట జడ్జిగారు యీ కేసును తిరిగి విచారించి ఇటాలోసెలాషినో నిర్దోషని తేల్చారట నష్టపరిహారంగా అతనికి సంవత్సర కాలం జైల్లో వున్నందుకు గాను 600 మార్కులు (వాళ్లూరి డబ్బు) అంతేగాక రోజుకు పది మార్కులుయివ్వాలని తీర్మానించారట — ఎ నావెలిన్కమ్ !



శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం, కళాక్షేత్రం ఏలూరు వారి ఆధ్వర్యంలో ఈమధ్య కూచిపూడిలో జరిగిన శ్రీ సిద్ధేంద్ర యోగి జయంత్యుత్సవాలకి ఆంధ్రప్రదేశ్ మంత్రులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు, శ్రీ భాట్టం శ్రీరామమూర్తి విచ్చేశారు కూచిపూడి సిద్ధేంద్ర కళాక్షేత్రం వారిచే నృత్య ప్రదర్శనలు, రామ నాటకము, నృత్య నాటకం ప్రదర్శన జరిగాయి సిద్ధేంద్ర కళాక్షేత్రం ప్రిన్సిపాల్, అధ్యాపకులు, విద్యార్థి బృందం లని చిత్రంలో చూడవచ్చు

## నృత్యం పోగొట్టుకున్న నర్తకి

మ్యూనిచ్‌లో భారత దేశానికి చెందిన సోవాల్ మన్‌సింగ్ అనే వో నర్తకి, ఆమె భర్త కలసికారులో మొన్న 25 వ తేదీన వెళుతుండగా వారి కారుకు వో లేడి అడ్డొచ్చిందట ఆ లేడి ప్రాణాలు కాపాడే ప్రయత్నంలో వారి కారు తల్లక్రిందులై ఆమెకు విపరీతంగా దెబ్బలు తగిలాయట ఆమె భర్తకు కొంచెం కూడా దెబ్బలు తగల్లేదట ఆమెకు తగిలిన దెబ్బల వల్ల ఆమె యిక నృత్యం చేయలేక పోవచ్చని అక్కడి వైద్యనిపుణులు అభిప్రాయపడ్డారట

## పసితనంలో మాటల ప్రయత్నం

పుట్టిన ఎనిమిది వారాలకే పసిపిల్లలు మాట్లాడడానికి విపరీతమయిన ప్రయత్నాలు చేస్తారని, చేతులు, కాళ్ళు, నాలుక కదుపుతూ తమ అభిప్రాయాలు వ్యక్తం చేస్తూ వుంటారని బ్రిటనుకు చెందిన డాక్టర్ కాల్విన్ ట్రివార్తెన్ అన్నారట




పెద్ద వాళ్ళు నాలిక ఆడిస్తే చూసి అదే విధంగా తమ నాలుకను కూడా ఆడించడానికి నెల రోజుల పసిగుడ్డు ప్రయత్నిస్తుందని కూడా ఆయనన్నారట

## కోర్టుకెక్కిన భగవంతుడు

వెల్లూరు లక్ష్మీనారాయణ పెరుమాళ్ళ ఆలయానికి చెందిన భూముల్ని కొందరు గత కొన్ని దశాబ్దాలుగా సొంతానికి వాడుకుంటున్నారట ఇది అన్యాయమని ఆలయానికి చెందిన ట్రస్టీలు మద్రాసు కోర్టుకెక్కితే కోర్టు విచారించి ఆ పొలాలు భూములు అన్నీ కూడా సాక్షాత్తూ భగవంతుడిదేనని తీర్పిచ్చిందట గాడ్ విన్స కేసిన్ ట్వెంటీయత్ సెంచురీ కోర్ట్!

## పెద్దల తగాదాకు సామాన్యుల బలి

24 వ తేదీన ఆదోని తాలూకా పల్లిపాడు గ్రామములో ఆ గ్రామ సర్పంచ్ నాగిరెడ్డి అనే ఆయన వో యిరవై మంది అనుయాయులతో కలసి బోయ నరిసిరెడ్డి, కుమ్మరి పెద్దబజారి అనే వారిని మారణాయుధాలతో వెంబడించారట వారిద్దరూ శక్తి కొద్దీ పరుగెట్టి, బోయ తిమ్మారెడ్డి అనే ఆయనింట్లో జొరబడి తలుపులు బిడాయించుకున్నారట దాంతో సర్పంచిగారికోపం వచ్చి ఆ యింటికి నిప్పంటించారట ఫలితంగా బజారి, నరిసిరెడ్డిగాక ఆ యింట్లో వున్న వో పిల్లవాడు, ముగ్గురు ఆడవారు కూడా కాలి చనిపోయారట— స ఇంద్ర తక్షకాయ స్వాహా అంటే ఏమిటి?

# రామనాథన్ క్రిష్ణన్ కి ప్రియమైన కాఫీ:

# నెస్‌కాఫీ!

"ఉత్తేజ కల్పనకు
దక్షిణాది కాఫీ
గింజలతో
తయారయిన
కాఫీకి దీటులేదు.
నా కాఫీ మోస్తరు...
నెస్‌కాఫే."



అభిరుచికి తెలుసు కాఫీకి అలవడినవారికి తెలిసినట్టు ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫీ విశిష్టమని దానిని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారని అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో




## నెస్‌కాఫీ

నెస్‌కాఫీ మిక్కిలి ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL 90(2) 233 TEL

# హైదరాబాద్ నోట్‌బుక్

(15వ పేజీ తరువాయి)

వారి కష్టనివారణ ముఖ్యం" అన్నారు ఆయన "నాస్తికునకు మీ బోధ ఏమిటి ?" అన్నాను "ప్రపంచంలో నాస్తికుడనేవాడులేడు నాస్తి నాస్తి అంటూనే పక్కా ఆస్తికుడవుతాడు" అని ఒక నవ్వు కుమ్మరించారు ఆయన ఆధ్వర్యాన రోజూ 150 మందికి అన్నదానం చేస్తారు ఇది 30 కేంద్రాలలో రోజుకొక ప్రాంతంలో జరుగుతుంది గోశాల వుంది రోజూ 40 మందితో అఖండ చండీ సప్తశతి పారాయణం చేయిస్తారు ఉదయం భోజనం చేయరు రాత్రి ఒకపూట మితంగా భుజిస్తారు రోజుకు రూ 500 ఖర్చు వుంది శిష్యులు, ధర్మపరాయణులు ఇస్తారు "సర్వీస్ ఎందుకు మానుకున్నారు ?" అనడిగాను "దానిలోని అన్యాయాలు అవకతవకలు చూసి మనసు ఒప్పలేదు నా పూర్వులధర్మం ధర్మప్రచారం మాకు 500 ఏళ్ల నుంచి దేవీ ఆరాధన వస్తున్నది స్వధర్మం ఎంచదనిపించింది గృహస్థాశ్రమం విరామయం ఇలాంటి ధర్మనిష్ఠకు రెండు దశాబ్దాలుగా సాగుతూంది నా పద్ధతి లోకం జెడ్ వంటిది సామాన్యులకు మూగ అన్న పెట్టువారికి తత్త్వచింత" అన్నారు ఎక్కువసేపు ఉంటే నా మనస్సులోనివి చదివేస్తారేమోనని సెలవు పుచ్చుకున్నాను ఇంతగొప్పవాళ్లు రాసాగారు

## కిరసనాయిల్ కొరత

జంట నగరాలలో కిరసనాయిలు కొరత ఎక్కువ తీవ్రమయింది చిల్లర కిరసనాయిలు దుకాణాల ముందు పసిపిల్లలతో బారులుతీరి నిలబడిన తల్లులను చూస్తుంటే కడుపుతరుక్కుపోతుంది ఒక్క సికింద్రాబాద్‌లోనే దాదాపు 13 వందల కిరసనాయిలు దుకాణాలు ఉండగా కిరసనాయిలు కరువేమిటని మాజీ కార్పొరేషన్ సభ్యులు శ్రీ సి ఆర్ కృష్ణ, శ్రీ ఎం స్వామి ఒకపత్రికా ప్రకటన చేశారు పోనీ, కొవ్వొత్తులతో పని జరుపుకొందామా అంటే, వాటి ధర సామాన్యునికి అందనంత దూరమైంది సివిల్ సరఫరా అధికారులు ఈ దుకాణాలను తరచు తనిఖీ చేసి, ప్రజలకు సౌకర్యం కలిగించాలని వీరు తమ ప్రకటనలో కోరారు. రేషన్‌కార్డులకు కిరసనాయిల్ సరఫరా చేస్తామని నగర ప్రధానరేషన్ అధికారి శ్రీ వి గోవిందరాజన్ ప్రకటించడం చాల సంతోషకరం

## ఉపశ్రుతి

"రోజురోజుకూ అన్నిట్లోను నిర్బంధాలు, చట్టాలు మితిమీరుతున్నాయే, ఏమవుతుంది చివరకు ఏమవుతుంది ?" అన్నాడు ఒక అమాయక జిజ్ఞాసువు "ఏమవుతుంది ? ఎట్టి పంగనామాలు పెడితే, గోడచాటుకు పోయి గోకివేశాడట అన్నట్లు వుతుంది'" అన్నాడు పక్కన ఉన్నవాడు

# దొంగ



సుస్మితా రమణమూర్తి

ప్రతి మనిషి జీవితాన్ని తరచి చూస్తే ఎన్నెన్నో గాథలు వెలికి వస్తుంటాయ్ కొన్ని వస్తూనే వెలుగు నిస్తాయ్ మరికొన్ని ఎంతో బాధకి గురిజేస్తాయ్

సుమారు పది సంవత్సరాల నాటి సంఘటన దాన్ని నేనెప్పుడూ మరచిపో(లే)ను ఆ సంఘటన గుర్తుకి వచ్చినపుడల్లా నాలో ఏదో తెలియని ఆవేదన — అసంతృప్తి తలెత్తుతుంటాయ్ మనసు బాధతో మెలికలు తిరిగిపోతుంటుంది

ఒకరోజు —

ఆ రోజు ఆదివారం, స్నేహితులు బలవంతం చేస్తే 'మార్నింగ్ షో' సినిమాకి వెళ్ళాను సినిమానుంచి ఇంటికొచ్చేసరికి వాతావరణం అనుకోని ఎథంగా మారింది నింబడవున్న అమ్మ, నాన్నల ముఖాల్లో కనుబొమల్లో కోప చిహ్నాలు వికటాట్టహాసం చేస్తూంటె — మాటా పలుకూలేని ఆ వాతావరణం నిశ్శబ్దాన్ని మాత్రం నింపుకుని వుంది కారణం అనూహ్యంగా మిగిలిపోయినా, నా మనస్సు అపశృతిని వినిపిస్తూ నన్ను భయపెట్టసాగింది ఆ వాతావరణం ఇంకొంత సేపు అలాగే ఉంటే ప్రపంచమే బ్రద్దలైపోతుందన్నంత భయం నన్నావరించగా మెల్లిగా అన్నాను— "అమ్మా! ఆకలేస్తుంది అన్నం పెట్టవే!" అని అమ్మ,నాన్న ఒకేసారి నావేపు కోపంగా చూశారు

వాళ్ళని నేనెపుడూ అంత కోపంగా వుండటం చూళ్ళేదు అదే మొదటిసారి కిక్కురు మనకుండా మూలనున్న కుర్చీలో అప్రయత్నంగా కూర్చుండిపోయాను

"ఏరా,రామూ! ఎక్కడికిరా వెళ్ళావ్?"— నాన్నగారి గొంతు ఖంగుమంది చెప్పాను తడబడుతూ

"డబ్బులెక్కడివి?" — మరో ప్రశ్న దూసుకొచ్చింది

అమ్మవేపు చూశాను—సమాధానంగా

అంతవరకు ఏదో పుస్తకం చూస్తున్న ప్రక్కింటి సుందరమ్మ అంటే నా అత్యంత ఆప్తమిత్రులు జగం, సురేంద్రల తల్లి అంది

"అడిగేదేదో సూటిగా అడక్క ఆ డొంక తిరుగుడేంవిటండీ?" అని

"మీకెందుకో మధ్య?" ప్రక్షంగా అన్నాను

"ఏం బాబూ! ఎందుకంత పౌరుషం? మావారి వాచీని తీసినపుడు ఈ పౌరుషం ఏమైందో??" అందామె మూతిని మూడొంకర్లు తిప్పతూ

ఆ మాటలకి నాకు 'ఎలక్ట్రిక్‌షాక్' తగిలినట్లయింది

నా మెదడు మొద్దుబారిపోయింది

ఆ అర్థంలేని అపవాదు — నా కర్థమయే సరికి— నాకేం చెప్పాలో తోచలేదు అసలెందుకా వస్తువు పోయింది? పోయినా — ముందు వెనుకా ఆలోచించకుండా నా మీద నేరం ఆరోపించడమేంవిటి? నన్ను గురించి అసలు వీళ్ళేంవిటను కుంటున్నారు? . . ఇలాంటి కొన్ని వందల ప్రశ్నలు నాలో వెల రేగుతుంటే . .

ఏం చెప్పాలో తెలియక, ఇలాంటి పరిస్థితెందుకు ఏర్పడిందో అర్థంగాక — అయోమయంగా మాత్రం నిల్చుండి పోయాను.

ఆ మాటల తలంపు ఒక అవమానంగా, అసహాయతగా అన్పించి కళ్ళల్లో నీళ్ళుబికాయ్

"ఏరా, అలా దిక్కులు చూస్తావేం? వాళ్ళ వాచీని తీశావా లేదా?" నాన్నగారి గొంతు కంచులా మ్రోగింది

"లేదు, నాన్నా! లేదు వాళ్ళ వాచీని నే తీయలేదు" వస్తున్న దుఃఖాన్ని ఆపుకోడానికి విశ్వప్రయత్నంచేస్తూ అన్నాను

నా పరిస్థితుల్లో ఉన్న మరెవరైనా అనగలిగే మాటే అన్నను

నిజంగా 'దోషి' ఆ పరిస్థితుల్లో చిక్కుకున్నప్పుడు ఇచ్చే సమాధానమే ఇచ్చాను అయినా నన్నెవరూ నమ్మలెదు

'వెధవకి ఇంతప్పట్నుంచే దొంగబుద్ధులు! పెద్దయితే వీడ్ని పట్టుకోగలమా? పోలీసుల కప్పగిస్తేగాని వీడిరోగం కుదరదు" అని బుగ్గలు నొక్కుకుంది సుందరమ్మ

"నేను దొంగని కాను నాకే పాపం

తెలియదు నన్ను నమ్మండి నిజంగా నాకేవీ తెలియదు '' అంటూ బావురుమన్నాను

సుందరమ్మ నా మాటలకి ఛీత్కారం చేసింది

ములుకుల్లాంటి ఆవిడ మాటల్ని భరించలేక మానాన్నగారు — ''వెధవా! ఇల్లూ, వాకిలీ లేనట్లు వీళ్లింట్లోను, వాళ్లింట్లోను చదువుకోడం దేనికి? ఆఏడ్పేదో మనింట్లోనే ఏడ్వకూడదూ?'' అంటూ చితకబాదేరు నన్ను

నేను వెక్కి వెక్కి ఏడుస్తుంటే మాఅమ్మ బాధపడుతూ, ''సుందరమ్మగారూ! మీరేవీ అనుకోనంటే నాదొక్కమాట! మావాడు మీవారి వాచీని తీయడం మీయింట్లో ఎవరైనా చూచారా?'' అంది

''వేరే చూడాలటమ్మా! నిన్నటిరాత్రి మా జగం, సురేంద్ర, మీవాడు ఒకేదగ్గర పడుకున్నారు వీళ్ల ప్రక్కనున్న బల్లమీదే మా వారు తన వాచీని వుంచారట ఇంకెవరు తీస్తారు?– మీవాడుతప్ప! ''

''మీ డ్రైవరు గాని . పనివాళ్లు గాని ''

''వాళ్లెవరూ రాకముందే మావారు అడిగారు ...న్ను ఐనా మా పనివాళ్లుగాని– డ్రైవరుగాని మీరనుకుంటున్నంత నీచమైన వాళ్లు కారు''

నాకు కళ్లనీళ్ల పర్యంతమైంది

''పిక్‌నిక్‌కి వెళ్లిన మీజగంగాని సురేంద్రగాని ''

''ఛ! ఛ! ఇలాంటి బుద్ధులు మాఇంటా వంటా లేవు మా వస్తువుల్ని మేమే దొంగిలించుకోవాల్సిన లగత్యమేవీ మాకు పట్టలేదు''

జగం, సురేంద్రల ప్రసక్తి వచ్చేసరికి ఆరోజుకి ముందురాత్రి జగం – సురేంద్రతో అన్నమాటలు ఒక్కసారిగా గుర్తుకొచ్చాయ్

''ఒరే, జగం! నాన్నగారు నిద్ర పోయార్రా! రేపు తెల్లవార్జామునే మనం పిక్‌నిక్‌కి వెళ్తున్నాంగదా! నాన్నగారిని వాచీని అడగటమే మరిచిపోయాం'' తన చేతికి పెట్టుకున్న వాచీకేసి ఎంతో సంతృప్తిగా చూసుకుంటూ అన్నాడు సురేంద్ర

''ఈ మాత్రం దానికే ఇంత ఇదైపోవడం దేనికి? వాచీని తీసుకెళ్తున్నట్లు అమ్మకి చెబితే సరి'' అని జగం అనేసరికి సురేంద్ర ఊరట చెందాడు నన్నుకూడా పిక్‌నిక్‌కి రమ్మన్నారు కాని యోగాశ్రమాన్ని నేనప్ప



టికే రెండుసార్లు చూసి వుండటంవలన నేను రానని చెప్పేశాను ఐతే వాళ్లు ఇంట్లో ఎవరికీ చెప్పకుండానే వాచీ తీసుకెళ్లి పోయారన్న మాట!

సుందరమ్మగారు రుసరుసలాడుతూ నా జేబుల్ని తడిమిచూసి, ''దొంగవెధవ! అప్పుడే ఎక్కడ మార్చేశాడో?'' అనేసరికి నాఆలోచనలు చెదిరిపోయాయ్

ఆమె నన్నలా తనిఖీ చేయడంతో నాగుండెనెవరో నులిమినట్లు ఫీలయ్యాను,

నాకు తెల్సిన విషయాన్ని సుందరమ్మగారితో చెబితే? ఉహూఁ! నమ్మదు పైగా కట్టుకథలల్లుతున్నానని మరింత ఎగిరి పడుతుంది ''ఒహవేళ మీ జగంగాని... సురేంద్రగాని '' అన్న అమ్మసందేహానికే ఆవిడమండిపడిందే! ఇహ నా మాట నమ్ముతుందా? అందులోను జగం, సురేంద్రలు తీశారంటే



నమ్ముతుందా?–అసలు నమ్మదు పైగా మరింత చిందులు త్రొక్కుతుంది జరిగిన విషయం ఆవిడకు జగం, సురేంద్రల ద్వారానే తెలియజేయాలి అప్పుడుగాని ఆవిడ నన్ను నమ్మదు హుఁ! వాళ్లొచ్చేంతవరకు ఆవిడ దృష్టిలో నేను దొంగని! నా అంతరాత్మ ముందు నిర్దోషిని!!

ఆమె ఆశించినట్లుగా వాచీ నా జేబుల్లో కన్పించక పోయేసరికి సుందరమ్మగారు పేట్రేగిపోయారు కోపంతో

చేసేదిలేక అమ్మకూడా నా చెంపల్ని చెళ్లుమన్పించింది

వెక్కి వెక్కి ఏడ్వడం తప్ప మరేవీ చేయలేకపోయాను

విషయం ఇంతవరకు వచ్చింతర్వాత కూడా ఆవిడ నమ్మకం ఎవడిక్కావాలి? జరిగిన విషయం ఆమె నమ్మినా నమ్మకపోయినా చెప్పేయాలి– అని అనుకుంటున్నంతలో, ''ఇక్కడున్నావేంటే?నా కాకలేస్తుంది. వేగంగా రావే, అమ్మా!'' అంటూ జగం వచ్చాడు

జగంని చూడగానే నా శరీరం దూది పింజలా తేలిపోయింది అంతవరకు అనుభవించిన చిత్రవధ, నరకం ఒక్కసారిగా నన్ను వీడిపోయాయ్

''ఏవిట్రా! అప్పుడే వచ్చేశారా? సాయంత్రం దాకా రారేమో ననుకున్నా!''ఆప్యాయంగా కొడుకు తల నిమురుతూ అంది సుందరమ్మ

''యోగాశ్రమంకే కదమ్మా, వెళ్లింది! అందుకనే వేగంగా వచ్చేశాం!''అన్నాడు జగం

అంతవరకు సుందరమ్మగారి మీద నాలో పేరుకున్న కోపం, అసహ్యం ఒక్కసారిగా విజృంభించాయ్

''ఏవండీ! సుందరమ్మగారూ! పిలిపించారా పోలీసుల్ని?'' అన్నాను హేళనగా—జగం వున్నాడు కదాన్నధీమాతో.

ఆమె ముఖం కోపంతో ముటముటలాడిస్తూ అంది: ''చేసిననిర్వాకంకి సిగ్గులేక పోతేసరి వాచీని మటుమాయం చేయడఁవే కాకుండా పోలీసుల్ని పిలవాలట! పోలీసుల్ని!!'' ఆమె మాటల్ని ఖాతర్చెయ్యకుండా జరిగిన విషయాన్ని చెప్పమన్నట్లుగా జగం ముఖంలోకి ముఖంపెట్టి చూశాను నే నాశించినట్లుగా జగం జరిగింది చెప్పలేదు నా ముఖమైనా చూడలేదు పైగా అమ్మా! నా కాకలేస్తుంది వేగంగా రావే!'' అంటూ వెళ్లిపోయాడు

జగం అలా వెళ్లిపోయినందుకు ఆశ్చర్యం, కోపం, ఆవేదన ఒక్కసారిగా నాలో చోటు చేసుకున్నాయ్

ఆశ్చర్యంలోంచి తేరుకునేంతలో సురేంద్ర వచ్చాడు.

తనేమైనా చెబుతాడేమోనని కొన్ని క్షణాలెదురుచూశాను ఫలితం లేకపోయింది

దాంతో నా మనసు కకావికలమైపోయింది

సురేంద్రవేపు కసిగా, కోపంగా చూస్తూ సుందరమ్మగారితో అన్నాను— ''సిగ్గుపడాల్సింది మీరుగాని నేనుకాదు. పిలవండి పోలీసుల్నే పిలుస్తారో!... మరెవర్ని పిలిపిస్తారో!!...''

''నీ వాలకం చూస్తుంటే మీవాళ్లపరువు ప్రతిష్ఠలు నడిబజారున కీడ్చేట్లున్నావే!!'' కోపంలోంచి ఆశ్చర్యంలోకి దిగుతూ అందామె.

''హుఁ! పరువు! ప్రతిష్ఠ!!.. .. మా పరువు, ప్రతిష్ఠలేవో నాకు బాగా తెల్సులెండి. వాటి నెలా నిల్పుకోవాలో కూడా తెల్సు. కాని బజారున కెక్కబోయేవి మీ పరువు, ప్రతిష్ఠలనిమాత్రం తెల్సుకోండి''ఆవేశంగా అన్నాను.

నా మాటలు మా నాన్నగారికి కోపాన్ని తెప్పించాయ్.

"వెధవా! వేలెడంత లేవు ఏంవి(టా ఆ మాటలు ? పెద్దంత్రం చిన్నంత్రం వుండక్కర్లా ? ?" అన్నారు

"ఇంతదాకా వచ్చింతర్వాత కూడా అవెందుకు నాన్న? మర్యాదనేది ఇచ్చిపుచ్చుకోవడంలోనే నిలుస్తుంది డబ్బుండగానే సరిపోదు నోటిమంచితనం– పరిస్థితుల్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోగల సామర్థ్యం—వివేకం మనిషన్నవారి కెంతైనా అవసరం అవి లేకుంటే మనిషి మనిషి కాదు(డు)"

అమ్మ, నాన్న నా మాటలకి ఆశ్చర్యపోయి చూస్తుండిపోయారు.

సురేంద్ర తేలుకుట్టిన దొంగలా మిన్నకుండిపోయాడు

"దొంగవెధవ! దొంగవెధవ!! ఎంతెంత మాటలంటున్నాడు!? ఏంవి చూసుకునో ఆ నోటి పెడసరం ? ఎంత ధైర్యం! ఎంత ధైర్యం!!" విసవిసలాడిపోయింది సుందరమ్మ

నిజమే! సుందరమ్మగారన్నట్లు అంతంత పెద్దమాటలు నేనేనా అన్నాను?—అని నాకే ఆశ్చర్యం వేసింది

"హుఁ! దొంగవెధవ! నేనా? లేక మీ ముద్దుల కుమారుడా? ముందు నిర్ణయించుకోండి ఆ తర్వాత నోరు పారేసుకుందురు" అసహ్యం పుట్టిపడేలా అన్నాను

సుందరమ్మ అవాక్కై (ప్రక్కనున్న సురేంద్రని కొన్నిక్షణాలు చూస్తుండిపోయింది

ఆమె ముఖంలో కొట్టొచ్చినట్లు అసహనం, అవమానం కోపం తాలూకు ఛాయలు కన్పించాయ్

సురేంద్ర తనకేంవీ తెలియనట్లు దిక్కులు చూస్తుండేసరికి నా కెక్కడి లేని కోప మొచ్చింది

"జరిగింది ఇప్పటికైనా చెబుతావా? చెప్పవా?" అన్నట్లు సూటిగా సురేంద్ర కళ్లలోకి చూశాను.

అతని అధరాలు విచ్చుకున్నాయ్.

ముత్యాల్లా మాటలు వెలువడ్డాయ్

అవి నే నాశించినవి కావు

సురేంద్ర తన తల్లిని ఓదార్చడానికి పలికిన పలుకులవి నాలోని ఆరాటాన్ని – అసహనాన్ని – ఆవేదనని విస్మృతం చేసిన మాటలవి

ఓ ప్రక్క – సురేంద్రలా అన్నందుకు కోపంతో కూడిన ఆశ్చర్యం! మరోప్రక్క– నా నిర్దోషిత్వాన్ని చాటుకోలేని అసహాయ స్థితి! సురేంద్ర అన్నమాటలు ఇప్పటికీ నా చెవుల్లో గింగురు మంటున్నాయ్, వాటిని నే నెప్పుడూ మరచిపో(లే)ను— "అమ్మా! చేతి కందేట్లు, విలువైన వస్తువుల్ని పైన వుంచడం కేవలం మన బుద్ధి పొరపాటు, ఒకర్ననేంలాభం ? తప్పంతా మనది పోతే పోయిందిలే!–వెధవది వాచీయేగా ?– కాని మనుషుల విలువలు తెలిశాయ్!"

అలాంటి పరిస్థితిలో –

నేనేం చేయగలను ?

నన్ను దొంగని చేశారు నేను నిర్దోషినని ఎలా చెప్పకోను ?

మా వాళ్లకి, సుందరమ్మగార్కి నేను నిర్దోషినని రుజువు చేసుకోవాలి! ఐతే అదెలా సాధ్యం ?

ఏదైనా ఆధారం కావాలి! – ఎలాంటి ఆధారం కావాలి ?

అందుకు నేనేం చేయాలి ?

నేను దొంగని కానని నిరూపించుకునేదెలా ?

జగం, సురేంద్ర లెందుకలా మారిపోయారు ?

వారికి నేనేం అపకారం చేశాను ?

'నీవు దొంగవి కావు! దొంగవి కావు !!' అని ఘోషిస్తున్న నా అంతరాత్మ ఘోష విన్పించుకునే వారే లేకపోయారు నేను దొంగని కానని నా అంతరాత్మకి తెలిసినా నాకు సంతృప్తి లేదు

నేను దొంగని కానని అందరికీ తెలియాలి తెలియజేయాలి అప్పుడే నాకు నిజమైన ఆనందం! సంతృప్తి!! సంతోషం!!! ఐతే ఎలా? ఎలా??

సురేంద్రకు తను చేసిన పని తప్పని తెల్సినా – నిజాన్ని ధైర్యంగా ఒప్పకోడానికి అతని అహం, అభిమానం అడ్డుపడ్డాయ్.

అసలు తనింట్లో తనే దొంగతనం చేయాల్సిన ఖర్మేంపట్టింది తనకి ?

జగంకి విషయం క్షుణ్ణంగా తెల్సినా ఎందుకు ఊరుకున్నాడు ?

జరిగిన విషయంకి వాళ్లు పశ్చాత్తాపపడ్లేదు క్షమనర్థించలేదు

చేయని నేరం నాపై పడినందుకు – నేరస్థునిగా పరిగణింపబడి నందుకు – శిక్షగా ఆ రోజు నేను తిండి తిప్పలు లేకుండా వీధి గుమ్మం ముందే కాలం గడిపినప్పుడు – "హమ్మయ్య! అసలే ఇంట్లో చెప్పకుండా వాచీ తీసుకెళ్లాం అంతటితో పోకుండా – వెధవది, దురదృష్టవశాత్తు పారేసుకున్నాం కూడా ఈ విషయం అమ్మతో ఎలా చెప్పటమా ? – అని చాలా భయపడ్డాం కదూ ? 'థేంక్‌గాడ్!' 'లక్కీ'గా ఆ నేరం– ఆ రామూగాడిమీద పడింది గనుక మనం బతికిపోయాం! " అని నన్ను చూసుకోకుండా సురేంద్ర, జగంతో అన్న మాటలు కేవలం నా ఒక్కడికే కాకుండా – అందరికీ విన్పించివుంటే– నా మీద పడిన ఈ అపవాదు మాసిపోనుకదా?—అని నాలోనేనే వాపోయాను

ఏమయితేనేం ?—

కనీసం విషయం తెలియని అమ్మా, నాన్నల దృష్టిలో దోషిని! దొంగని!!

నా అంతరాత్మముందు నిర్దోషిని!

సురేంద్ర, జగంల అంతరాత్మలముందు నిర్దోషిని!

సురేంద్ర, జగంల తల్లి [illegible]లో దోషిని! దొంగని!!



FREE! **రత్నాల రాసులు** ఉచితం!

## స్వల్పమైనది

"గాలిలో అటు ఇటు కొట్టుకొని చస్తున్నాను నీ కొమ్మల మధ్య నాకింత చోటియ్యవూ ? చిన్న మర్రి విత్తనం ఒక పెద్ద తాటిచెట్టును అడిగింది "అయ్యో ? నీ వెంత, నీ పరిమాణ మెంత నీ ఇష్టము వచ్చినంతకాలం ఉండు నే వద్దనను" అని పలికింది తాటిచెట్టు, కొంత కాలానికి తాటిచెట్టు తన చిన్ని అతిథిగూర్చి సంపూర్తిగ మరచిపోయింది అయితే ఆ చిన్న విత్తనం మవునంగా కూర్చోకుండ, నెమ్మదిగా తాటిచెట్టు బెరడుల్లోనుండి, తాటి చెట్టు యొక్క అంతర్భాగానికి, తన వేరుతన్ని ఎదగటం మొదలు పెట్టింది దానిని చూచిన తాటి చెట్టు "నీవుచేసిన దేమిటి ? అని బిగ్గరగ కేకలు వేసింది" నీవేగా నీ కొమ్మల మధ్య నాకు చోటిచ్చావు" బదులు పలికింది మర్రిచెట్టు" అవును ! అప్పుడు చిన్నదానివి అయితే ఇప్పుడు నీవు బలంగా పెపుగా ఎదిగిపోతున్నావు ఇంక నీ భారాన్ని నేనూ భరించగలను తక్షణమే ఇక్కడనుండి తొలగిపో ! కోపముతో బిగ్గరగా కేకలు వేసింది తాటిచెట్టు "మన మిద్దరము కలసే ఎదిగియున్నాము ఇప్పుడు నన్ను పొమ్మంటే ఎక్కడికి పోగలను, ఇంతకు ఇప్పుడు నేను త్రెంపుకొని వేరైపోతే నీవు మరణించగలవు జాగ్రత్త ? బెదరించింది" మర్రిచెట్టు దానిని విదలించుకొందామని తాటిచెట్టు శతవిధాల ప్రయత్నించిందిగాని, లోతుగ వేర్లు తన్ని ఎదిగిన మర్రిచెట్టు అంత సులభంగ విడిపోగలదా చూస్తు చూస్తుండగానె అందమైన తాటఆకులు ఎండిపోయి క్రిందకు వ్రేలాడాయి చెట్టులోని అంతర్భాగమంత తొలచివేయబడింది మర్రిచెట్టు ఆకులు కొమ్మలు వేసేకొలది, తాటిచెట్టు కుంగి కృశించి, వాడి చివరికి మరణించింది

సాధారణంగ మామిడి కొమ్మలమధ్య తాటిచెట్ల మధ్య, వాటిపొరంపేల్చుకొని పెరిగె బదనికలు (Parasites) కనిపిస్తుంటాయి చిన్న విత్తనముగా వచ్చి పెద్ద ప్రమాదముగా మారి వారికి ఆశ్రయమిచ్చిన చెట్టుకే హానికలిగిస్తుంటాయి చిన్న చిన్న పాపాలు కూడ, అటువంటివి, తనకు తాను తెలుసుకుని విడువపెట్టిన పాపాలు, పశ్చాత్తాప పడనిపాపాలు, విడువక హత్తుకొన్న పాపాలు ఎంతస్వల్పమైనవైన చివరికి వాటని ప్రేమించి ఆశ్రయమిచ్చిన జీవితాన్ని నాశనం చేయకుండ విడిచిపెట్టవు ఏ Recreation Club లోనో ఒక పెగ్ విస్కీతో మొదలుపెట్టి త్రాగుబోతుగా మారినవారు, 5 రూపాయిలతో గుర్రప్పందెంలో మొదలుపెట్టి లక్షలు పోగొట్టుకొన్నవారు సరదాపేకాటతో మొదలుపెట్టి పేకాటలో భార్యమంగళసూత్రాన్ని కూడ తాకట్టుపెట్టినవారు లోకములో ఎంతమందిలేరు మానవులను నరకానికి నడిపించేవి, ఈ చిన్న చిన్న పాపాలే

"దేవ నన్ను శోధించి నా హృదయమును తెలిసికొనుము, నన్ను పరీక్షించి నా ఆలోచనలను తెలిసికొనుము నీకాయాసకరమైన మార్గము నాయందున్నదేమో చూడుము నేను రహస్యముగా చేసిన అపరాధము క్షమించి నన్ను నిర్దోషిగా తీర్చుమని" భక్తుడొకడు తన దేవుని వేడుకొన్నాడు పాపాన్ని మొక్కలోనె పెకలివెయ్యాలిగాని వృక్షముగ పెరిగితె దానిని తొలగించటం కష్టం చిన్న పాపంకు హృదయములో చోటివ్వక ప్రభువైన క్రీస్తుకు మీ హృదయములో చోటివ్వండి

**- చదలవాడ చంద్రమతిదేవి.**

| ఉచితం | ఉచితం |
| --- | --- |
| మీ ఇంట్లో కూర్చుని బైబిల్ పరిశోధనమీద చక్కటి సర్టిఫికెట్ పొందాలన్నా, బైబిల్‌కి సంబంధించిన అందమైన విలువగల పుస్తకములు కావాలన్నా ఒక కార్డుపై మీ పూర్తి అడ్రసు స్పష్టంగా వ్రాయండి పోస్టు ఖర్చులుకూడ మావే<br>HOPE | ఇదీ అడ్రసు<br>**ఎస్. జాన్ డేవిడ్,**<br>నిరీక్షణ,<br>పోస్టుబాక్స్ నం 12,<br>**చిలకలూరిపేట,**<br>(గుంటూరుజిల్లా)<br>A M G |

The Gospel Message Inserted by Mr S John David, Nireekshana, Post Box No 12, Chilakaluripet, Guntur Dt, For A M G Through M/s Hope Advertising & Public Relations, Swamy Street, Gandhinagar, Vijayawada-520003

## అ బ ల

(36వ పేజీ తరువాయి)

కోరింది ఒకటే అయిన రోజున జీవితం స్వర్గమే అవుతుంది అనుకుంటారా ? ఏ మనిషి ఎప్పుడూ తనకి అన్నీ వున్నాయన్న తృప్తితో బ్రతకలేడు అది మానవ సహజం ఇంతకీ చెప్పేది ఏమిటంటే మన జీవితాన్ని సుఖమయం చేసుకోటం అన్నది కొంతవరకూ మన చేతుల్లోనే వుంటుంది, అది మన చేతుల్లోంచి జారిపోయిందంటే మన తప్పే అవుతుంది అలాంటితప్పు చేయలేకే ఈఉత్తరం వ్రాస్తున్నాను మిమ్మల్ని నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను మీ అంత చదువూ, తెలివీ లేకపోయినా మనిషిని అర్థంచేసుకుని మంచిగా బ్రతక గలిగే శక్తిమతనాకు వుంది అదే హోదాతో ఈ నాడు ఈ మాత్రం సాహసం చేయగలిగాను

అది మంచిదే అనుకుంటే మీ సమాధానం ఏమిటో త్వరగా తెలియజేయండి

మీతో కలిసి నడవాలని తహ తహలాడే

ఒక సామాన్య వ్యక్తి

గోపీ కృష్ణ

మాధవికి ఏమి చెయ్యాలో తోచలేదు ఆ రోజున పరంధామయ్యగారు తన కొడుకు గురించి చెప్తుంటే ఎందుకో అనుకుంది. అయితే అసలు విషయం యిదన్నమాట అనుకుంది

గోపీ ఎందుకిలా వూహించుకుంటున్నాడు. తనకి అలాంటి వుద్దేశ్యం ఎప్పుడూ కలగలేదే ఏమైనా తను మాత్రం పరంధామయ్యగారికి కృతఘ్నురాలు కాలేదు యిలా ఎంతసేపో ఆలోచిస్తూ వుండిపోయింది

అటు గిరి, మధుమూర్తి,యిటుగోపీకృష్ణ అందరూ తననే వాంఛించటంలో అర్థం ఏమిటి అది సానుభూతి చూపటమా చులకన చేయటమా— వీళ్లందరిలో యిలాంటి మార్పు తీసుకురావటానికి తను ఎంతవరకూ కారకురాలు ? అని వూహించుకుంది కాని ఏదీ నిర్ణయించుకోలేకపోయింది

గోపీ విషయంలో మాత్రం చాలా సేపు ఆలోచించి ఒక నిర్ణయానికి రాగలిగింది

కాగితం కలం తీసుకుని వ్రాయటం ప్రారంభించింది

శ్రీ గోపీకృష్ణగారికి,

గాలివీస్తున్న వైపుకి తెరచాప ఎత్తితే

పడవ తొందరగా సాగిపోతుంది అదే ఎదురు గాలికి ఎత్తితే పయనమే కుంటిపడుతుంది జీవితంకూడా అంతే

పరిస్థితులు చూసుకుంటూ మనులు కోటం నేర్చుకోవాలి నా మనసులో మాట అర్ధం చేసుకుంటారని ఆశిస్తాను కొందరికి కొన్ని అవకాశాలున్నా వాటిని ఉపయోగించు కోలేరు కొందరు తప్పనిసరిగా వుపయో గించుకోకూడదు — — కొందరు ఉపయో గించుకున్నా ఫలితం ఉండదు వీటిలో ఏదో ఒకటి నాకు వర్తించక తప్పదు అందుకే నన్ను మర్చిపోమని కోరుకుంటున్నాను మా నాన్నగారు మీ మీద ఎన్నెన్నో ఆశలు పెట్టుకుని బ్రతుకుతున్నారు ఒక్కగానొక్క కొడుకు మీరు ఒయన్ని సంతోష పెట్టడం మీ కర్తవ్యంగా భావించాలి అంతేకాదు మీ నాన్నగారు నాకు చేసిన సహాయానికి నేను కృతఘ్నురాలినై ఆయన మనసుని క్షోభ పెట్టలేను — — యింకో విషయం నేను ఎవ్వరినీ ప్రేమించలేను— అది నా బలహీనత అనుకున్నా, మూర్ఖత్వంఅనుకున్నాబాధపడను దయచేసి అంతా మర్చిపోమని కోర్తూ

మాధవి

మర్నాడు పరంధామయ్యగారు యింట్లో లేని సమయం చూసుకుని లోపలికి వెళ్లింది మాధవి యశోదమ్మగారితో అదీ యిదీ మాట్లాడ్తూ గోపీ గదిలోకి వెళ్లింది ఆ యిల్లాలికి తెలియకుండా ఆ వుత్తరం అతని టేబిల్ మీద పెట్టి బయటకు వచ్చింది

ఉత్తరం చదువుకుని సమాధాన పడ్తాడని ఆశించింది

* * *

మర్నాడు కాలేజీకి వెళ్తుంటే మధు మూర్తి కనిపించాడు దారిలో

"మిమ్మల్ని ఒకటి అడగాలనుకుంటు న్నాను" అంది సిరియస్‌గా

"అదేమిటో నాకు తెలుసండీ" అన్నాడు మధు తేలికగా నవ్వేస్తూ

"అయితే దానికి మీ సమాధానం" కటువుగా లడిగింది

"మీకు ఎలాంటి అనుమానం కలగ కూడదని " యింకా ఏదో చెప్పటానికి ప్రయత్నించాడు

"ప్లీజ్ ఆన్సర్ టు ది పాయింట్"

"ఆల్‌రైట్ అయితే చెప్తాను వినండి మీ ఫీజు కట్టింది మిష్టర్ గోపీ కృష్ణ అతను మీ యింటి యజమాని పరంధామయ్యగారి సుపుత్రుడన్న సంగతి మీకు తెలుసు కాని నా స్నేహితుడని మాత్రం మీకు తెలియకపోవచ్చు" అన్నాడు తేలికగా.

"అదంతా నాకనవసరం ముందు ఆ ఫీజు ఎందుకు కట్టారో చెప్పండి"

"ఆ విషయం నాకంటే మీకే ఎక్కువ తెలియాలి" అదొక రకమైన నవ్వు

మాధవి మనసు కుత కుతలాడి పోయింది కాని ఏమీ చేయలేక పోయింది

* * *

దిండులో ముఖం దాచుకుని పడుకుంది మాధవి

## ఇంటింటి చిట్కాలు

★ కత్తిగాని, చాకుగాని బొగ్గుపొడితో పాలిష్ చేస్తే అవి తళ తళ లాడుతూ ఉంటాయి!

★ బట్టలమీద పడ్డ కిళ్లీ మరకలు పోవాలంటె కాస్త పెరుగుగాని, నిమ్మకాయ చెక్కగాని బట్టలపై రుద్దాలి

★ చెంచాడు ఉప్పువేసి బట్టలను జాడించి ఆరవేసిన బట్టలపై నీలిమందు జాడలురావు

★ నిమ్మకాయలను నీటితోపాటు, కొన్ని నిముషాలు మరగనిస్తే తరువాత కోసి పిండి నప్పుడు ఎక్కువ రసాన్నిస్తాయి

★ ఎంగిలి మురికి చేతులైనా బంభ పడాలంటే వాడిన టీ పొడి ఉపయోగించాలి

★ కత్తెరకు పోయిన పదును తిరిగి రావా లంటే గరుకు కాయితాన్ని కత్తిరించాలి

★ గోధుమలపై పిడికెడు ఉప్పురాళ్లు, వేపాకులువేసి మూత పెడితే అతి స్వదంగా ఉంటాయి

— పంతంగి రవీంద్ర శ్రీనివాస్

"కాలేజీకి వెళ్లలేదామ్మా" అంటూ లోపలికి వచ్చారు పరంధామయ్యగారు

వులిక్కిపడి లేచి కూర్చుని — "యిప్పుడే వచ్చాను అంకుల్" అంది కంగారుగా

"చూడమ్మా నీతో ఒక్కమాట చెప్పి పోదామని వచ్చాను" అన్నారు కుర్చీలో కూర్చుంటూ

ఏం వినవలసి వస్తుందోనని భయం భయంగా చూసింది మాధవి

"మావాడు యిలాంటి పని చెస్తాడని నేను ఎప్పుడూ అనుకోలేదమ్మా వాడేదైనా అని నీమనసు నొప్పించి వుంటే మన్నించు" అన్నారు

"అబ్బే లేదు అంకుల్ అలాంటిదేమీ జరగలేదు" మాటలు తడబడింది మాధవి

కొన్ని క్షణాలు నిశ్శబ్దం

"నాదో చిన్న కోర్కె తల్లీ నువ్వు తీర్చుతావనే ఆశపడుతున్నాను" అన్నారు దీనంగా

"చెప్పండి అంకుల్ మీరు ఏపని చేయమన్నా చేస్తాను యిలాగైనా మీ ఋణం తీర్చుకోనియ్యండి" కంటతడి పెట్టింది

"అంతమాట లనకుతల్లీ" అని ఆగి పోయారు

బలంగా నిట్టూర్చి — "నువ్వు నువ్వు యిల్లు ఖాళీచేసి వెళ్ళిపోవాలమ్మా నిన్ను వాడు మర్చిపోవాలి అంటే యిదొక్కటె మార్గంతల్లీ ఈ వ్యామోహంలోంచి వాడ్ని నువ్వే తప్పించాలి యిలా అంటున్నానని మనసు కష్టపెట్టుకోవద్దు యింతకు మించి నేను చెప్పవలసింది ఏమీ లేదుతల్లీ ఏంచేస్తావో నీచేతుల్లో పెడుతున్నాను వస్తానమ్మా" అంటూ వచ్చినపని పూర్తయి నట్లు కుర్చీలోంచి లేచారు

పెదవులు బిగించి ఆవేశాన్ని దిగమింగింది మాధవి ఇప్పుడు తను ఎక్కడికి వెళ్ళాలి ? ఒక్కసారి యిల్లుఖాళీ చేసెయ్యమన్నారే . యిప్పుడు తనేమైపోవాలో ఆలోచించారా ? యింతకీ తను చేసిన తప్పేమిటి ? తనకెందు కంత శిక్ష విధించారు — తను వేస్తున్న ఏ ప్రశ్నకీ సమాధానం వుండదని అమెకు తెలుసు అయినా మనసు మౌనం వహించ లేక పోయింది

క్షణకాలం మాధవి వైపు చూస్తూ వుండిపోయారు కాని ఏమీ మాట్లాడలేదు

'నీకూతురైతే యింత అన్యాయం జరగ నిచ్చునా' అంది మనసు

'సొంతకొడుకు యింటి పరువు మంట కలుపుతుంటే చూస్తూ వూరుకోమన్నావా' అంది వ్యామోహం

"నీ మంచితనమే నీకు శ్రీరామరక్షతల్లీ" అన్న ఆయన మాటలు మాధవికివినిపించలేదు

పరంధామయ్యగారు బయటకు వెళ్ళి పోయారు

గదితలుపులు మాత్రం తెరచే వున్నాయి ? ?



"చాలా ఖరీదైనదా?"



"కాదు. ఇది కమలావారి తయారీ."



తక్కువ ఖర్చుతో
ఎక్కువ చూపులు!

కమలా

పోలియస్టర్ బ్లెండ్ సూటింగులు

CU A 1311

# అవీ ఇవీ అన్నీ

రేపటి వసంతం
(కవితా సంపుటి)

శ్రీ ఎల్లోరా కవితలు 'రేపటి వసంతం' మా కార్యాలయము చేరింది 128 పేజీలు గల ఈ పుస్తకం వెల 5 రూపాయలు ప్రతులకు:

1 ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాద్—3

2 ఎం శేషాచలం అండ్ కో, మద్రాసు—1

3 నవోదయా పబ్లిషర్స్ ఏలూరు రోడ్డు, విజయవాడ—2

4 విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరు రోడ్డు, విజయవాడ—2

మానవతా! మేలుకో—

వచన కవితలు రచన: శ్రీ ఎస్ మునిసుందరం 58 పేజీలు వెల మూడురూపాయలు ప్రతులకు విజయకృష్ణా పబ్లికేషన్స్, 190/10, కొటకొమ్మల వీధి, (తిరుపతి)

విధి విలాసం

నవల రచయిత శ్రీ పి వి బి రాజు 88, పేజీలు వెల మూడు రూపాయలు రాజా పబ్లిషింగ్ హవుస్, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా ●




మడమ
పగుళ్ళు?



లిచెన్‌సా
వాడండి

DZ1613ATG

Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street. Gandhinagar, Vijayawada 3 Editor S. Radhakrishna



జగపతి పిక్చర్స్

# మంచి మనుషులు

ఈస్ట్మన్ కలర్

నిర్మాత-దర్శకుడు: వి.బి.రాజేంద్రప్రసాద్ B.Sc.,







మాటలు: ఆత్రేయ-సత్యానంద్

సంగీతం: కె.వి.మహదేవన్

ఫొటోగ్రఫీ: ఎస్.వెంకటరత్నం W.I.C.A.,

కళ: ఎస్.కృష్ణారావు

అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్

ANA